# మీరా మాధురి

డా॥ ఇలపావులూరి పాండురంగరావు




ప్రచురణ

తిరుమల తిరుపతి దేవస్థానములు

తిరుపతి

1992

MEERA MADHURI

by

DR. ILAPAVULURI PANDURANGA RAO

T.T.D. Religious Publication Series No: 403

Edited by

D. Nagasidda Reddi

First Edition: 1992

Copies: 5000

Price:

Published By:

Sri M.V.S. PRASAD, I.A.S.

Executive Officer,

T. T. Devasthanams,

Tirupati.

Printed at:

T. T. Devasthanams Press,

Tirupati.

# ముందుమాట

భాగవతపురాణం ప్రతిపాదించిన శ్రవణకీర్తనాది నవవిధ భక్తి మార్గాల్లో ఆత్మనివేదనభక్తి కొక విశిష్టత ఉంది. భక్తుడు పరమాత్మని దర్శనానికై పరితపిస్తూ అనన్యభావంతో ప్రార్థించడం, తన సర్వస్వాన్నీ భగవంతునికి సమర్పించి శరణాగతిని పొందడం ఆత్మనివేదనం. దీనికే మధురభక్తి అని పేరు. ఇందుకు ప్రతీకలు గోపికలు. తనను శ్రీకృష్ణార్పణం చేసికొని ఆ గిరిధరగోపాలుణ్ణే పతిగా వరించి తరించిన మీరాబాయి కూడ ఈ గోపికల వరుసలో చేరిన మహాభక్తురాలే. ఈమె పేరు స్మరించగానే శ్రీరంగేశుణ్ణి భర్తగా సేవించిన గోదాదేవి గుర్తుకు వస్తుంది.

రాజస్థానంలోని మేవాడరాజ్యాంతర్గతమైన 'కుట్కీ' అనే గ్రామం మీరా జన్మస్థలం. ఈమెతండ్రి రత్నసింహుడు. మేవాడప్రభువైన సంగ్రామసింహుని కుమారుడు భోజరాజు ఈమె భర్త. మీరా తన జీవితంలో ఎన్నో కష్టాల్ని ఎదుర్కొన్నది. కానీ పసితనం నుంచే గిరిధర గోపాలుణ్ణి భర్తగా ప్రేమించిన మీరాను ఈ కష్టాలేవీ చలింపజేయలేక పోయాయి. క్రీ. శ. 1565 వ సం. || లో ఈమె బృందావనం చేరింది. ఈ భక్తురాలు రచించి పాడిన భక్తి సంకీర్తనలు అచ్చటి ప్రతి అణువును పవిత్రం చేయడం జరిగింది. క్రీ. శ. 1630 లో శ్రీకృష్ణ పరమాత్మతో ఐక్యమైన మీరాబాయి గేయాలు అజరామరాలై యావద్భారతదేశాన్నీ పునీతంచేస్తూ వున్నాయి. హిందీ సాహిత్యంలో ఈమెకు గల స్థానం సాటిలేనిది.

మీరాబాయి గేయాల్లోని మాధుర్యాన్ని లలితమైన వ్యావహారిక శైలిలో డా. ఇలపావులూరి పాండురంగారావుగారు రుచి చూపించారు. ఈమె గేయాల్లోని భక్తి విలువల్నీ, మాధురీ మహిమను తెలుగువారి కందించటం పవిత్ర కర్తవ్యంగా భావించిన తి .తి . దేవస్థానములు ఈ

గ్రంథాన్ని ఆ గోదా గ్రంథమాల నుండి స్వీకరించి ద్వితీయ ముద్రణంగా ఇప్పుడు ప్రచురించింది. చదువరులు మీరా జీవితాన్ని ఆదర్శంగా గ్రహించి, ఆస్తిక్యబుద్ధితో భగవంతుని దయకు పాత్రులై మా కృషిని సఫలంచేస్తారని మా ఆశ.

తిరుపతి,
4-7-91.

యం. వి. యస్. ప్రసాద్.
కార్యనిర్వహణాధికారి
తి .తి. దేవస్థానములు.

# భావలహరి



మీరాదేవి కవితాహృదయానికి ఇవి పంచకోశాలు
ఆమె పంచప్రాణాలే యీ భావపంచమి

గోవిందం గోకులానందం
గోపాలం గిరిధారిణమ్,
గోలోకవాసినం వందే
గోదా మీరాధినాయకమ్.

—రచయిత

# అవతారిక

"మధు వాతా ఋతాయతే
మధు క్షరంతి సింధవః.
మాధ్వీర్నః సంత్వోషధీః
మధు నక్తముతోషసి
మధుమత్ పార్థివగ్ం రజః,
మధు ద్యౌ రస్తు నః పితా:
మధుమాన్ నో వనస్పతిర్
మధుమాగ్ం అస్తు సూర్యః;
మాధ్వీర్గావో భవంతు నః."

---ఋక్కు 1-90

మధుర మంగళ మహనీయమైన యీ మహీనిలయంలో ప్రతిక్షణం ప్రతి కణం ప్రచ్ఛన్నమైన మాధుర్యాన్ని ప్రకటిస్తూనే ఉంటుంది. క్షణం తీరికలేకుండా సకల చరాచర జగత్తులో సంచరించే చల్లని గాలి ఎంత కమ్మగా ఉంటుంది ! కొండల్లో, కోనల్లో సందుచేసుకుని సరస సల్లాపాలతో ఆడుతూ పాడుతూ జీవకోటికి జీవనదానం చేస్తూ ప్రవహించే జీవ నదుల్లో పారే నీరు ఎంత తియ్యగా ఉంటుంది ! తల్లి లాంటి రాత్రి, తండ్రిలాంటి పగలు, ఇద్దరి వాత్సల్యాన్ని సమపాళ్ళలో సమకూర్చుకున్న ఉభయ సంధ్యలు ఎంతటి తియ్యని ఊహలను సృష్టి స్తాయి : ఇక్కడ మట్టిలో కూడా ఎంత మాధుర్యముంది: అంతులేని ఆకాశాన్ని ఆకర్షించి ఆదరించే శక్తి యీ వసుమతిలో ఉంది. ఈ మట్టిలోని మాధుర్యం, సూర్యునిలోని సామర్థ్యం రెండింటిని కూడగట్టు కుని యిక్కడి వనసంపద వర్ధిల్లుతూవుంది. మానవజాతిలోని మాధు ర్యమే చెట్ల చేమల్లో, పశుపక్ష్యాదుల్లో కూడా ప్రతిబింబించి ఉంటుంది.

నింగినుంచి నేలవరకు ఎక్కడ చూచినా అంతులేని మాధుర్యం కని పిస్తుంది. కాని కనగలిగిన కన్నులకే అది కనిపిస్తుంది. కనలేని వారికి అంతా శూన్యమే.

అనంత శూన్యంలో చిరంతన మాధుర్యాన్ని సాక్షాత్కరించుకొని సేవించి తరించిన పుణ్యజీవి మీరాబాయి. చిన్నతనంనుంచి చివరి క్షణం వరకు కన్నయ్యను తన కన్నుల్లో దాచుకొని చూడవలసిన సొంపును చూచి, చూరగొనవలసిన సారస్యాన్ని రుచి చూచి, చేరవల సిన గమ్యాన్ని చేరిన ధన్యజీవి మీరాబాయి. ఆమె పేరు వినగానే మనకు గోదాదేవి (ఆండాళ్) గుర్తుకు వస్తుంది. ఇద్దరి మధ్యా ఏడెని మిది శతాబ్దుల వ్యత్యాసమున్నా, ఇద్దరి జన్మభూమికి వెయ్యి మైళ్ళకు పైగా వ్యవధానమున్నా ఇద్దరి భావభూమీ ఒకటే. ఇద్దరూ మధుర భక్తితో భగవంతుని సేవించిన ప్రేమమూర్తులే. ఇద్దరికీ భగవదనుగ్రహం పరిపూర్ణంగా లభించింది. శ్రీ గోదాదేవి వాగ్విలాసం ద్రావిడ దివ్య ప్రబంధంలో చోటుచేసుకున్నట్లే మీరా గీతాలు భక్తుల హృదయాల్లో శాశ్వతంగా స్థిరపడిపోయినాయి. ఇద్దరిదీ గోపికల్లాంటి సహజభక్తే. అది మధురభావన. పెరియాళ్వార్ (విష్ణుచిత్తుని) కనులపండువుగా విల్లి పుత్తూరులో అవతరించి రంగనాథుని హృదయాంతరంగంలో లీనమ యిన రంగనాయకి ఆండాళ్. అలాగే రాజవంశంలో పుట్టి రాజఠీవితో పెరిగి గోపాలచక్రవర్తికోసం సర్వసంగపరిత్యాగం చేసి చివరకు ద్వారకాధీ శుని ఆలయంలో గిరిధరసాయుజ్యాన్ని సాధించిన సాధ్వి మీరాబాయి. ఈ పోలికలను జాగ్రత్తగా పరిశీలించి చూస్తే ఆ గోదాదేవి లోకోద్ధ రణకార్యం ఇంకా మిగిలినందున తానే కొంతకాలానికి మీరాబాయిగా అవతరించిందా అనిపిస్తుంది. లేక మధురాపతి హృదయమాధుర్యాన్ని మాటమాటకీ మానవకోటికి రుచి చూపించేందుకు ఏ గోపికో ఈ యిద్దరిరూపంలో అవతరించినా అవతరించి ఉండవచ్చు.

శ్రీకృష్ణునిమీది అనురాగం స్త్రీరూపం దాల్చినట్టుగా కనిపించే మీరాబాయి నరనరంలో నందనందనుడు నాట్యం చేస్తుంటాడు. గిరిధరగోపాలుడు తప్ప మరొకరు ఆమెకు తెలియదు. ప్రపంచంలో మరో పురుషుడు ఉన్నట్టుగా కూడా ఆమె గుర్తించదు. ఒకసారి ఆమె బృందావనం వెళ్ళినప్పుడు అక్కడ చైతన్య సంప్రదాయానికి చెందిన మహాపురుషుడు జీవగోస్వామి ఉన్నారని తెలిసి ఆయన్నిచూచేందుకు ఆమె వెళ్ళింది. ఆయన "తాను స్త్రీలకు దర్శనమియ్య"నని ఆమెకు కబురు పంపారు. "బృందావనంలో శ్రీకృష్ణుడుకాక మరికొందురు పురుషులున్నారని తెలిసి తనకు చాలా ఆశ్చర్యంగా ఉందని" ఆమె సమాధానం చెప్పి పంపించింది. దానితో జీవగోస్వామి జీవనాడిలో సంచలనం కలిగింది. వెంటనే ఆయన ఒట్టి కాళ్ళతో వెళ్ళి మీరాకు స్వాగతం చెప్పారు.

గిరిధరగోపాలుడు మీరాబాయికి కేవలం ఆరాధ్య దైవమేకాదు. ఒకవిధంగా ఆమెకు ఆయన బాల్యస్నేహితుడు కూడా. చిన్నప్పుడు ఆమె తండ్రిగారి యింటికి ఎవరో సాధువు వచ్చి పూజచేసుకుంటూ ఉన్నాడట. అతని పూజలో గోవర్ధన గిరిధారి ప్రతిమనుచూచి మీరాబాయి ఆ బొమ్మ తనకు కావాలని వాళ్ళ అమ్మను వేధించిందట. కాని ప్రాణంతో సమానంగా చూచుకొనే ఆ ప్రతిమను మీరాకు ఇచ్చేందుకు ఆయన ఒప్పుకోలేదు. ఆ తర్వాత అతనికి గోపాలుడు కలలో కనిపించి ఆ ప్రతిమను మీరాకు ఇయ్యటం శ్రేయస్కరమని చెప్పాడట. ఆ మాటప్రకారం విధిలేక సాధువు మళ్ళీ మీరాబాయి యింటికి వెళ్ళి ఆ ప్రతిమను ఆమెకు ఇచ్చాడట. అనాటినుంచి మీరాబాయి ఆ మూర్తిని వదలకుండా మాటి మాటికీ దానిని చూచుకొని ఆనందంతో పొంగిపోయేదట. ఇంతకీ అప్పుడామె వయస్సు నాలుగయిదేండ్లు మాత్రమే.

ఒకరోజు పక్కింట్లో పెళ్ళవుతూ ఉంటే చూచి మీరాబాయి తనను ఎవరికిచ్చి పెళ్ళి చేస్తారని అమాయికంగా వాళ్ళ అమ్మనడిగిందట. ఆమె నవ్వుతూ కూతురిచేతిలో ఉన్న బొమ్మను చూపించి "అతనే నీ భర్త" అని చెప్పిందట. ఆ మాట మూటగట్టుకొని మీరాబాయి గిరిధరగోపాలుడే తన భర్త అని రూఢిచేసుకుంది. బాలగోపాలుని లీలలను కీర్తిస్తూ ఆడటం పాడటం ఆమెకు బాల్యంనుంచీ అలవాటయింది. నందనందనుడు నా భర్త అని నాట్యంచేస్తుంటే అది రాజభవనం కాబట్టి పెద్దవాళ్ళు ఆమెను మందలిస్తూ ఉండేవాళ్ళట. బయటి వాళ్ళు పరిహసించేవాళ్ళట. కాని ప్రేమావేశంతో పరవశించే ఆ పరమప్రేమ స్వరూపిణికి అవన్నీ పట్టలేదు. ఒకరోజు తాను వరించిన గిరిధరునితో తనకు పరిణయమయినట్టు ఆమెకు కల వస్తుంది. ఆ కలను సాకల్యంగా తల్లికి చెప్తుంది. ఇలాగే గోదాదేవికూడా 'వారణ మాయిరమ్' అనే తిరుమొళిలో ప్రియునితో తన స్వప్న సమాగమాన్ని కళ్ళకుకట్టినట్లు వర్ణిస్తుంది. శ్రీమన్నారాయణుడు వెయ్యి యేనుగులతో విల్లిపుత్తూరుకు తరలివచ్చినట్టే దీనబంధువయిన గోపాలుడు మీరాబాయిని చేపట్టేందుకు ఛప్పన్ (56) 'కోటి దేవతలతో విజయం చేస్తాడు వారియింటికి.

సర్వలోకాధిపతియైన శ్రీనాథుని తన కొంగుకు ముడివేసుకున్న మీరాబాయి లౌకిక జీవితమంతా అష్టకష్టాలతో గడిచింది. అష్టవిధము లయిన ఐశ్వర్యాలతో తులతూగవలసిన ఆ రాజకుమారికి ఆప్తబాంధవు లందరూ కొద్దికాలంలోనే ఒక్కరొక్కరు దూరమై పోతారు. నాలుగయిదు సంవత్సరాల వయస్సులోనే తల్లి పోవటం, ఆ తర్వాత తాతపెంపకంలో పెరగటం, పెళ్ళయిన ఆరేడు సంవత్సరాలకే భర్త మరణించటం, ఆ తర్వాత అయిదేండ్లకు తండ్రి వీరమరణం పొందటం, తర్వాత రెండు మూడు సంవత్సరాలకు మామగారు మహారాణా కూడా మరణించటం, అంతకుముందే అల్లారు ముద్దుగా తన్ను పెంచిన తాతగారు పరమపదిం

చటం, తన శ్రేయోభిలాషులందరూ చెల్లిపోవటంవల్ల మరదుల చేతుల్లో పడరాని బాధలు పడటం, వీటికే తోడు చిన్న చిన్న కలహాల్లో చిక్కుకున్న రాజకీయ పరిస్థితులూ -- ఇవి అన్నీ కలిసి మీరాబాయి జీవితాన్ని చీకటిపాలు చేశాయి. జగత్పతినే తనపతిగా భావించిన మీరాబాయి వీటికి చలించలేదు. ప్రాపంచిక కష్టాలనూ బాధలనూ ఆమె పారమార్థిక లాభంగా భావించింది. కుటుంబంలోని అశాంతి ఆమెను శాశ్వతశాంతి కోసం ప్రేరేపించింది. కష్టభూయిష్ఠమయిన సాంసారిక జీవితం ఆమెకు కరుణామయుని వరప్రసాదంగా కనిపించింది. విషాదయోగం కర్మజ్ఞాన భక్తిమార్గాలకు దారితీసి ఆమెకు నిశ్శ్రేయసానందాన్ని ప్రసాదించింది. నిశ్చింతగా, ఏకాగ్రతతో తన ఆరాధ్యుని సేవించేందుకు ఆమెకు చక్కని అవకాశం లభించింది.

సారస్వత చరిత్రపట్ల మన పూర్వులకు ప్రత్యేకమైన శ్రద్ధ లేకపోవటం వల్లనూ, ఎక్కువమంది కవులు భక్తులు కావటంవల్లనూ, భక్తులకు భగవత్సంకీర్తనమీద ఉన్నదృష్టి తమ పేరుప్రతిష్ఠలమీద లేకపోవటంవల్లనూ మన కవుల (కవయిత్రుల) జీవిత విశేషాలు మనకు ఎక్కువగా తెలియవు. మీరాబాయి జీవితాన్ని గురించి పరిశోధన జరిగింది. పర్యవసానంగా మీరాబాయి క్రీ.శ. 1498 లో జన్మించి 1546లో సిద్ధిపొందినట్లు ఎక్కువమంది అభిప్రాయపడుతున్నారు. ఆమె జన్మస్థలం రాజస్థాన్. రాజస్థాన్‌లో జోధ్‌పూర్ సంస్థానాన్ని స్థాపించిన రావ్ జోధాజీ మీరాబాయికి ప్రపితామహుడు. అతని కుమారుడు రావ్ దూదాజీ (1440-1515). అతని నాల్గవ కుమారుడయిన రత్నసింహ్ మీరాబాయి తండ్రి. సమర భూమిగా, మరుభూమిగా ప్రసిద్ధికెక్కిన రాజస్థాన్ మీరాబాయి మహోదయంవల్ల నాలుగయిదు దశాబ్దాల పాటు భక్తి మందాకినితో కూడిన రసాస్థానంగా రంజిల్లింది. యుక్తవయస్సు (18 సం) లోనే మీరాబాయికి మేవాడ్ రాజకుమారుడయిన రాజా భోజ్‌తో వివాహమయింది. అయిదారు సంవత్సరాలు మాత్రమే

ఆమెకు దాంపత్యజీవితం దక్కింది. ఆ తర్వాత గిరిధరునికి అంకిత మైన ఆమె అనురాగం శాశ్వతసౌభాగ్యాన్ని సాధించింది. గోదా దేవిని లౌకిక విషయ వాసనలు ఈ మాత్రం కూడా స్పృశించినట్లులేదు. తులసి మొక్కలా మొలిచి రంగనాథుని అంతరంగంలో అనాయాసంగా లీనమైపోయిన కారణజన్మ ఆమెది. మీరాబాయికి కొంత కర్మ శేషం ఉండటంవల్ల ఆ మాత్రం బాధలు తప్పలేదు. కాని ఆ బాధలే మనల్ని ఆమె వైపు ఆకర్షించే అయస్కాంతచక్రం!

మీరాబాయి సర్వాంగపూర్ణ భక్తిసుందరి. సాహిత్యం ఆమెను వలచి వచ్చిన ఆత్మీయమైన అలంకారం. గిరిధర నామ సంకీర్తనం తప్ప ఆమెకు మరోసంగతి పట్టదు. కన్నయ్యకోసం ఆమె ఎలుగెత్తి పాడితే అందులోనుంచి ఏ వేవో భావనలు మధుర పదజాలాన్ని వెతుక్కొని వచ్చేవి. అదే మీరా గీతాలలోని నిసర్గ మాధుర్యం. సంగీతం కాని, సాహిత్యం కాని ఆమె సాధించినవికావు. అవి సహజంగా ఆమెకు లభిం చిన వరాలు. ఆమె పాట వినేందుకు ఒకసారి అక్బరు, తాన్‌సేన్ ఆమె దగ్గరికి వెళ్ళారంటారు. కాని చారిత్రకంగా ఇది నమ్మదగిన వృత్తాంతం కాకపోయినా ఆ రోజుల్లో మీరా గానమాధురికి ఉండే ప్రాశస్త్యం దీనివల్ల స్పష్టంగా తెలుస్తుంది. త్యాగయ్యలో కనిపించే భక్తి-సంగీత-సాహిత్య- సమ్మేళనం మీరాబాయిలో కూడా కనిపిస్తుంది. పాండిత్య ప్రకర్ష లేకపోవటమే ఆమె పాటల్లోని నిజమైన అందం. తన ఆనందం అందరికీ అందేట్టు ఆత్మీయమైన భాషలో ఆత్మను విప్పి చెప్పే ఆత్మగీతా లవి.

మీరాబాయి చాలా అదృష్టవంతురాలు. ఆమె గొంతు విప్పిన సమయంలో భారతదేశంలో నలుమూలలా అలాంటి గొంతుకలే కొన్ని వినిపిస్తూ ఉండేవి. ప్రాగ్భారతంలో చైతన్యమహాప్రభువు, వ్రజభూమిలో మహాప్రభువు వల్లభాచార్యులు, గుజరాత్‌లో నర్సీమెహతా, పంజాబులో

గురునానక్ మీరాబాయికి గురుతుల్యులు. సూరదాసు, జయదేవుడు, తులసీదాసు, రైదాసు ఆమెకు దాదాపు సమకాలికులు. కబీరుదాసు గానంద్వారా జ్ఞానాన్ని ప్రసారం చేసేందుకు ఆమెను ప్రేరేపించిన మహనీయుడు. కబీరులోని నిర్గుణ పరబ్రహ్మచ్ఛాయలు మీరాగీతాల్లో అక్కడక్కడ కనిపిస్తాయి. రవిదాసు (రైదాసు) ను ఆమె తన గురువుగా స్వీకరించింది. సూరదాసులోని సరసభావాభివ్యక్తి, తులసీలోని భావ గాంభీర్యం, జయదేవునిలోని పదలాలిత్యం, జాయసీలోని రహస్య భావనా మీరా రచనల్లో మేళవించి ఉంటాయి.

అత్తగారింట్లో అశాంతి ప్రబలినప్పుడు స్వజనులు ముఖ్యమా, స్వామి ముఖ్యమా అని మీరాబాయి తులసీదాసుకు తన ధర్మసందేహాన్ని తెలియ పరుస్తూ ఉత్తరం వ్రాసిందని అంటారు. అప్పుడు తులసీదాసు రామభక్తికి అంతరాయం కల్పించే బంధువులను పరిత్యజించుటయే శ్రేయస్కరమని తన అభిప్రాయం చెప్పాడట.

మధురభక్తిని సేవించటంలో మీరాబాయికి మరో సౌలభ్యంకూడా ఉంది. భగవంతుని భర్తగా భావించి సేవించటం మగువలకు సాధ్యమయి నట్లుగా మగవారికి చేతకాదేమో! సూఫీకవి జాయసీ, నిర్గుణ కవి కబీరు ఇలాంటి సాధన చేసిన వాళ్ళే. నరసీమెహతా కూడా మధురభావన తోనే మాధవుణ్ణి ఆరాధించాడు. కాని 'హరి మేరా పీవ్' మైఁ హరికీ బహూరియా' (హరి నా పతి, నే నాయన సతిని) అని కబీరుదాసు నోటవింటుంటే సరసంగా ఉండవచ్చును. కాని సమంజసంగా ఉన్నట్టు అనిపించదు. సూరదాసు కూడా వాత్సల్యంలో వాసికెక్కినట్లుగా శృంగా రంలో రాణించలేదు. పద్మావతి చరణ చారణ చక్రవర్తియైన జయదేవుడు కొంత రాధాకృష్ణుల అండతోను, కొంత పద్మావతి ప్రాబల్యంతోను మధుర భావనలో. మంచిస్థాయి నందుకోగలిగాడు. కాని మీరాబాయికి నరనరాల్లో వ్యాపించిన మధురభక్తి సహజలక్షణమయింది. 'జాకే సిర్

మోర్ ముకుట్ మేరో పతి సోయీ' (తలమీద నెమలిపింఛం కిరీటంగా పెట్టుకున్న బాలగోపాలుడే నా భర్త) అని మీరాబాయి అంటూంటే మనస్సు పరవళ్ళు తొక్కుతుంది. అదీ కాక, మాట సామెతగా మాధవుడు నా భర్త అంటే సరిపోదు. దానికి కావలసిన హంగులన్నీ ఉండాలి. భర్తను రంజింప జేసేందుకు భావభంగిమలు, నేర్పు, ఓర్పు, పట్టువిడుపు-అన్నీ కావాలి. ఇవన్నీ మీరాబాయికి స్త్రీ స్వభావం చేత కొన్నీ, సంస్కార బలంచేత మరికొన్నీ లభించాయి. భగవంతుని భవనపతి ( ఇంటాయన) అనటం ఒక్క మీరాకే చెల్లింది.

అలా అని మీరా శృంగారభావన మితిమీరిన అనురాగం కాదు. అది వాసన లేని ఉపాసన. ఆమె ప్రేమించిన గోపాలుడు. క్షణ భంగుర సౌందర్యరాశి కాదు. సూర్యచంద్రులు, పంచభూతాలు నశించినా కువ లయాన్ని నిలబెట్టే పరమేశ్వరుడు అవినశ్వరుడు. ఆమె వరించిన వరుడు సామాన్యులకు లభించడు. అంతరిక్షంలో పవ్వళించే అతని దగ్గరికి వెళ్ళేందుకు ఇరుకైన జ్ఞానమార్గంలో జాగ్రత్తగా పయనిం చాలి. త్రికూటభవనంలో కిటికీ తెరుచుకోగానే శూన్యం లోనుంచి శుభ్రమైన కాంతి వెలుగుతుంది. జన్మజన్మాంతరాల నుంచి నిద్రాణమై యున్న అంతస్సు మేల్కొంటుంది. చీకటి విడిపోతుంది. పరమాత్మతో తాదాత్మ్యం లభిస్తుంది.

ఇంత నిగూఢమైన ప్రేమను ఆరాధించే మీరాబాయి మధురభా వన ఎంతో సహజంగా సులభంగా కనిపిస్తుంది. మనతో మాట్లాడిన ట్లుగానే ఆమె మాధవునితో కూడా సంప్రదిస్తుంది. దీనబంధువు, భక్తవత్సలుడు, కరుణానిధి, ఆపదుద్ధారకుడు, గోవర్ధన గిరిధారి ఆమె పిలిస్తే పలుకుతాడు. అతణ్ణి పలుకరించుకునే మెలకువ ఆమెలో ఉంది. శ్రవణం, కీర్తనం, స్మరణం, పాదసేవనం, అర్చనం, వందనం, దాస్యం, సఖ్యం, ఆత్మనివేదనం ఇవి భక్తికి తొమ్మిది సోపానాలు. ఈ నవవిధ

భావాలూ మీరా గీతాల్లో నవరసభరితంగా కనిపిస్తాయి. ఇల్లూ, వాకిలీ వదలిపెట్టి భక్తుల సాంగత్యాన్నీ, భగవంతుని శ్రీచరణాలనూ సేవించిన మీరాబాయి ఒకప్పుడు కన్నయ్య కమనీయ రూపాన్ని కళ్ళకద్దుకొని గద్గద కంఠంతో గానం చేస్తుంది. మరొకప్పుడు గిరిధారి మాయింటికి వస్తున్నా డని ఉబ్బిపోయి గంతులు వేస్తుంది. చెంతనున్నా యెంత దూరంగానో ఉన్నట్లు అనిపించే హరి సాన్నిధ్యాన్ని స్మరించి పులకరి స్తుంది. వేరొక సమయంలో ఈ జీవితంలో ఒక్క సారయినా భగ వంతుని పాదారవిందాలు నాకు లభ్యమయ్యేనా అని కన్నీళ్ళతో కడవలు నింపుతుంది. ఒక్కొక్కప్పుడు తన మనోహరునితో ఏకాంత సౌఖ్యం అనుభవిస్తుంది. ఉన్నట్లుండి ఎలుగెత్తి పాడుతుంది. చిందులుతొక్కి నాట్యమాడుతుంది. దుర్భరమైన వేదనతో క్రుంగిపోతుంది. అంతలోనే అంతర్యామి ఆంతర్యం అంతుపట్టినట్లు పొంగిపోతుంది. దాసిగానయినా సరే ప్రభువుకు పరిచర్య చేస్తూ ఆయన పంచలో పడిఉంటానంటుంది. ఇలా మీరా గీతమాధురిలో అంచెలంచెలుగా అనేక భావాలు తరంగాయ మానంగా పొంగి పొరలుతూ శ్రోతలను ఉత్తుంగతలూగిస్తాయి. ఈ భావ లహరిలో అందం, అనురాగం, ఆవేదన, ఆత్మీయత, ఆనందం తెరలు తెరలుగా దొరలుతుంటాయి.

మీరా ఆరాధించిన అందం క్షణభంగురమైన లౌకిక సౌందర్యం కాదు. విశ్వమంతా వ్యాపించిన విరాట్ పురుషుని విలక్షణ సౌందర్య మది. ఎక్కడ చూచిన ఆ రూపమే గోచరిస్తుంది. అందం ఎలాం టిదో అనురాగం కూడా అలాంటిదే. అక్షయసౌందర్యం వల్ల లభించే ఆనందం కూడా అఖండంగానే ఉంటుంది. కాని యీ ఆనందసాధన అనుకున్నంత సులభం కాదు. అనురాగంతోపాటు ఆవేదన తప్పదు. ఆవేదనలో అరితేరితేనే గాని ఆత్మీయత కుదరదు. తనకూ తన ఆరాధ్య దైవానికీ సన్నిహితమైన సంబంధం ఏర్పడితేనే కాని అనురాగం

వల్ల రావలసిన ఆనందం రాదు. ఈ భావపరంపర మీరా పాటల్లో పటిష్ఠంగా కనిపిస్తుంది.

ఈ భావపంచమిని ప్రతిఫలింపజేసే 30 రచనలు ఈ సంకలనంలో ఉన్నాయి. శ్రీగోదాదేవి ధనుర్మాస దీక్షకు అనుగుణంగా 30 పాటలను 'తిరుప్పావై' అనే పేరిట రచించి నట్లే మీరా మాధురిలోని యీ 30 పాటలు కూడా భక్త కోటికి భావపాథేయం పంచిపెట్టగలిగిననాడు మాత్రమే యీ కైంకర్యం సార్థకమవుతుంది. ఈ మాధురిలో అందానికి సంబంధించినవి నాలుగు, అనురాగానికి సంబంధించినవి అయిదు, ఆవేదనకు సంబంధించినవి ఆరు, ఆత్మీయతకు సంబంధించినవి ఏడు, ఆనందానికి సంబంధించినవి ఎనిమిది--మొత్తం 30 పాటలు ఉన్నాయి.

మీరాబాయి పేరిట మనకీనాడు దాదాపు నాలుగు వందలపాటలు దొరుకుతున్నాయి. వీటిలో వందపాటలు ఎక్కువ ప్రచారంలో ఉన్నాయి. ఈ ప్రబంధరచనాదృష్టితో కూర్చిన సాహిత్యం కాకపోవటంవల్ల ఈ పాటల్లో పూర్వాపర సంబంధం అంతగా గోచరించదు. అక్కడక్కడ పునరుక్తికూడా కనిపిస్తుంది. కాని పాడిందే పాడినట్లు అనిపించకుండా ఏపాట కాపాట ముత్యాలమూటలా ముక్తసరిగా ముచ్చటగా గోచరిస్తుంది. మీరాబాయి తన రచనలు శాశ్వతంగా నిలిచిపోవాలని అనుకోలేదు. ఆలయంలో ఆరాధ్యుని యెదుట నిలబడినప్పుడు మనసులోని మాటలను వాక్కు ఎలా వివరిస్తే అలా వెలువడింది ఆమె గీతామాధురి. ఆమెకు లలిత అనే ఒక చెలికత్తె ఉండేదట. ఆమెవల్లనే మీరా గీతాలు మనకు ఈనాడు లభ్యమవుతున్నాయి. మీరా రచించిన పాటలను పదిలంగా భద్రపరచి భావిభారతికి అందించిన యీ భావుకురాలు భక్తివాఙ్మయానికి ఎనలేని సేవచేసిందని చెప్పాలి. లేకుంటే ఈనాడు మీరా గీతాలే మనకు దక్కేవికావు. మీరా జీవితకాలంలో ఆమె

విలువను గుర్తించినవారు తక్కువ. స్వజనులుకూడా ఆమెను నానా బాధలుపెట్టి ఎలాగయినా ఆమెను లౌకిక జీవితంలోకి మరలించాలని తీవ్రంగా ప్రయత్నించారు. అలాంటప్పుడు ఆమె రచనలను భద్రపరిచేందుకు వాళ్ళు కృషిచేసే ప్రసక్తిలేదుగదా. ఆమె ద్వారకాధీశ్వరుని ఆలయంలో ఉన్నప్పుడు ఆమెను ఏ విధంగానైనా యింటికి తీసుకుని రమ్మని మేవాడ్ యువరాజు ఉదయసింగు కొంతమంది బ్రాహ్మణులను పంపించాడట. ఆ బ్రాహ్మణులు ఆలయం బయట తిష్ఠవేసుకుని ఆమెవస్తే గాని వీల్లేదని 'మొండిపట్టు పట్టారట. సరే, ప్రభువునడిగి సెలవైతే వస్తానని మీరాబాయి ఆ రాత్రి ఆలయంలో ప్రవేశించిందట. మర్నాడు ఉదయం తలుపులు తెరిచి చూచేసరికి మీరాబాయి కనిపించలేదు. ద్వారకాధీశుని దివ్యమంగళవిగ్రహం మాత్రం చిరునవ్వులు చిందుతూవుంది. దాన్నిబట్టి మీరా తన ఆరాధ్యుని అనంత కాంతిలో లీనమైపోయినట్లు అందరూ భావించారు. ఇలాంటి దివ్యసిద్ధిపొందిన రససిద్ధ కవయిత్రి మీరాబాయి.

ఆమె ఆలోచనలెంత స్వతంత్రంగా ఉంటాయో, ఆమె భాష కూడా అంతవిలక్షణంగా ఉంటుంది. పుట్టింది రాజస్థాన్‌లో అయినా మధుర, బృందావనం, ద్వారావతి వీనిని తీర్థయాత్రల సందర్భంలో దర్శించినందువల్ల ఆయాప్రాంతాల పదజాలం ఆమెరచనల్లో కనిపిస్తుంది. ముఖ్యంగా వ్రజభాష, గుజరాతీ, రాజస్థాన్‌భాషలు ఆమె రచనలో గంగా, యమునా సరస్వతీ సంగమాన్ని సృష్టించాయి. నిజానికి ఆమెభాష హృదయ నిర్గతమైన సహజ సుధామాధురి. అన్ని భాషలకు చెందిన పదాలు ఆమెపదాల్లో స్వచ్ఛందంగా ప్రవేశించాయి. ఛందస్సు కూడా ఆమె చెప్పుచేతల్లో నడిచింది. మాత్రలు తక్కువయినా మాధుర్యానికి ఏమాత్రం లోటు రాలేదు. నిత్యజీవితంలో వలెనే కావ్యజీవితంలో కూడా ఆమెకు అలంకారాలమీాద మక్కువ తక్కువ. అయినా రకరకాల అలంకారాలు ఆమె వాక్కును వరించి అందులో ప్రవేశించాయి.

అప్రయత్నంగా అంతరంగంనుంచి ప్రవహించిన భావతరంగిణి ఆమె ఆరాధించిన గిరిధరునికి నచ్చింది. కనుకనే అది కలకాలం కళారంగంలో నిలబడగల శక్తిసామర్థ్యాలను సంతరించుకుంది.

అప్పుడప్పుడు భక్తిపారవశ్యంతో పాడుకొన్న పాటలే కాక జయదేవుని గీతగోవిందానికి ఆమె భాష్యంకూడా వ్రాసిందంటారు. రుక్మిణీకల్యాణవృత్తాంతంకూడా ఆమె గేయరూపంలో వ్రాసిందని చెప్తారు. కాని యీ రచనలు సమగ్రంగా మనకీనాడు లభించటంలేదు. సాంఘికమైన కొన్ని ఆచారాలనూ, వేడుకలనూ తీసుకొని ఆమె చక్కని పాటలు వ్రాసింది. అవిమాత్రం కొన్ని యీనాడు అక్కడక్కడ వినిపిస్తాయి. కాని మీరాబాయికి భారతీయ భక్తివాఙ్మయంలో శాశ్వతమైన స్థానాన్ని సమకూర్చింది—ఆమె గీతామాధురి. ఆమె భక్తిగీతాలు ప్రస్తుతం భారత దేశమంతటా వినిపిస్తాయి. త్యాగరాజ కీర్తనలు తెలుగు పొలిమేరలుదాటి సంచరించినట్లే మీరా గీతాలుకూడా, దూరతీరాలదాకా ప్రసరించి అనేకులకు ఆత్మానందాన్ని అందిస్తున్నాయి.

దాదాపు అయిదువందల సంవత్సరాలక్రితం మీరా మీటిన మధుర విపంచిక ఈ నాటికీ వీనుల విందుగా వినిపిస్తున్నది. ఆత్మసంగీత మలాంటిది. అది అజరం, అమరం గదా మరి!

## అందం

### 1

మన్ రే పరసి హరి కే చరన్ ।

సుభగ్ సీతల్ కమల్ కోమల్, త్రివిధ జ్వాలా హరన్ ।

జే చరన్ ప్రహలాద్ పరసే, ఇంద్ర పదవీ ధరన్ ||
జిన్ చరన్ ధ్రువ అటల్ కీన్హో రాఖి అపనీ సరన్ |
జిన్ చరన్ బ్రహ్మాండ భేంట్యో, నఖ శిఖా శ్రీ భరన్ ||
జిన్ చరన్ ప్రభు పరసి లీనే, తరీ గౌతమ్ ఘరన్ |
జిన్ చరన్ కాలీహి నాథ్యో, గోపలీలా కరన్ |
జిన్ చరన్ ధార్యో గోవర్ధన్, గరబ్ మఘవా హరన్ |
"దాసి మీరా" లాల్ గిరిధర్, అగమ తారన్ తరన్ ||

* * *

శ్రీకాంతుని చరణ కాంతిలో "మీరా మాధురి" ఆరంభమవుతుంది. అపాదమస్తకం ఆనందమూర్తిగా అర్హతగల ఆత్మవంతులను అనుగ్రహించే అఖిలాండకోటి బ్రహ్మాండ నాయకుని చరణకమలాలను ఒక్కసారి స్పృశించుమని, మీరాబాయి తన మనస్సుకు బోధిస్తున్నది. తామర పువ్వులా విప్పారిన ఆ చక్కని చల్లని పాదపద్మాలు తాకినంతనే తాపత్రయం రూపుమాసి పోతుంది. ఆ చరణ సమీరం సోకినంత వరకూ ఆ చల్లదనానికి అన్ని జ్వాలలూ క్షణంలో చల్లారిపోతాయి. ఎన్ని జన్మల తపస్సు ఫలిస్తేనో కాని ఆ చరణ స్పర్శ లభించదు. సకల సౌభాగ్య సంపదలను ప్రసాదించే శ్రీనివాసుని చరణములు మీరాబాయికి సుభగములుగా గోచరిస్తాయి. అంతటి సుభగ చరణములను నిష్ఠతో సేవించిన పరమ సౌభాగ్యవతి కనుకనే ఆమెకు వాటిలోని అందమే కాక చల్లదనం కూడా అనుభవగమ్యమవుతుంది. అసలాపాదాలలో అంతటి చల్లదనం ఎక్కడినుండి వచ్చిందో అని ఆలోచిస్తే వెంటనే చల్లని తల్లి గంగాభవాని గుర్తుకు వస్తుంది. ఆ పాదమూలమే కదా గంగమ్మకు పుట్టిల్లు. భాగీరథిచేత ప్రతిక్షణం పాద ప్రక్షాళన చేయించుకొనే స్వామియొక్క ఆ పాదాలు చక్కగా చల్లగా ఉండటమే కాక కమలములవలె కళకళ లాడుతూ కుసుమకోమల కాంతిని దశదిశలా

ప్రసరింపజేస్తూ ఉంటాయి. నీటిలో నీరజములు వికసించటంలో ఆశ్చర్య మేముంది? అంతేకాదు, ఆ గంగాభవాని త్రిపథగామిని. భూలోకాన్ని, భువర్లోకాన్ని, స్వర్లోకాన్ని పవిత్ర ధారలతో పరమ పావనం చేసే పతిత పావని గదా గంగా మాత. అలాంటి మహాతల్లి ఆశ్రయించిన పాదములు తాపత్రయమును పోగొట్టటంలో కూడా ఆశ్చర్యం లేదు. ఈ చరణ స్మరణను ఒక విధంగా మీరాబాయి గీతమాధురికి శాంతి పాఠంగా భావించవచ్చు. ఆధ్యాత్మికము, ఆధిభౌతికము, ఆధిదైవికము అని తాప త్రయము మూడు విధాలుగా ఉంటుంది. ఈ మూడు తాపాలనూ ఉపశమింప జేసుకునేందుకు "ఓం శాంతిశ్శాంతి శ్శాంతిః" అని ప్రణవ పూర్వకమైన శాంతిశబ్దాన్ని మూడుసార్లు ఉచ్చరించటం ఉపనిషద్వా ఙ్మయంలో పరిపాటి. ఆ పద్ధతినే మీరాబాయి శ్రీహరి చరణస్పర్శనే శాంతిపాఠంగా భావించి తనలోని ఆర్తిని ఆ ఆర్తత్రాణపరాయణునికే విన్నవించుకుంటుంది.

తన విన్నపం వమ్ము కాదని ఆమెకు గట్టి నమ్మకం. శ్రీచరణ ప్రభావం వట్టి కట్టుకథ కాదని ఆమె మాటిమాటికీ తన మనస్సుకు నచ్చ చెప్పుకొంటుంది. ఇంతకుముందు ఈ చరణములను సేవించి తరిం చిన పుణ్యాత్ము లెందరో ఉన్నారని అలాంటివాళ్ళలో ముఖ్యంగా చెప్పదగిన వాళ్ళను గురించి సంగ్రహంగా వివరిస్తుంది. అందరికంటె ముందు చెప్ప కొనదగినవాడు పరమభాగవతోత్తముడు ప్రహ్లాదుడు. 'భగవంతు వలగొను పదములు పదములు-' -- 'శేషశాయికి మ్రొక్కు శిరము శిరము'— అని అనన్య భక్తితో 'అడుగడ్గునకు మాధవానుచింతన సుధామాధుర్య మున' మైమరచి అనుక్షణం శ్రీచరణములనే స్మరించే ప్రహ్లాదుడు భగవంతుని అవలీలగా తన యింటికి రప్పించుకున్నాడు. ఇంద్ర పదవిని తన వాకిటికి తెప్పించుకున్నాడు. అలాగే సవతితల్లి చేత అవమాని తుడై కన్నతండ్రి మన్ననలకు దూరమైన ధ్రువుడు సర్వలోకశరణ్యుడైన శ్రీమన్నారాయణుని చరణారవిందములను సేవించి ఆచంద్రతారార్కం

నిలిచే అఖండ కీర్తిని సాధించాడు. ప్రహ్లాదుడూ, ధ్రువుడూ వయస్సుకు చిన్నపిల్లలే కాని భక్తిభావ పరిణతిలో ప్రౌఢులను మించినవారు. వామనావతారంలో భగవంతుడే వటువేషంలో వచ్చి బలి చక్రవర్తికి చరణ సాయుజ్యాన్ని ప్రసాదిస్తాడు. ముల్లోకాలనూ మూడుపాదాలతో ఆక్రమించిన ఆ త్రివిక్రముని పరాక్రమం శ్రీచరణ ప్రాభవాన్ని బ్రహ్మాండమంతటా చాటిచెపుతుంది. అలాగే రామావతారంలో శ్రీచరణస్పర్శ రాతిని నాతిగా రూపొందించి గౌతమ మునిశాపానికి గురియైన అహల్యకు ముక్తిని ప్రసాదిస్తుంది. కృష్ణావతారంలో ఆ చరణాలే కాళింది మడుగులో దాగియున్న భయంకర సర్పంలోని విషదర్పాన్ని అణచివేసి గోవులకూ, గోపబాలకులకూ అభయాన్ని ప్రసాదిస్తాయి. ఆ కృష్ణుడే తన చిటికెన వ్రేలిమీద గోవర్ధనపర్వతాన్ని ధరించి ఇంద్రునికి గుణపాఠం చెప్తాడు. వ్రేపల్లెను శిలావర్షంనుంచి చెక్కు చెదరకుండా కాపాడుతాడు. అలాంటి గోవర్ధనగిరిధారిని మీరాబాయి తన ప్రభువుగా, స్వామిగా, యజమానిగా స్వీకరించింది. ఆ మహాప్రభువుకు చరణదాసి మీరాబాయి. స్వామి చరణములే సంసారసముద్రాన్ని దాటేందుకు తరణోపాయాన్ని చూపించగలవని ఆమె దృఢవిశ్వాసం. సామాన్యులకు సాధ్యంకాని యీ పని శ్రీచరణసాహాయ్యం చేత భక్తులు అవలీలగా సాధిస్తారు. కనుకనే మీరాబాయి ఆ చరణనౌకను ఆశ్రయించి తరించవలసిందని తన మనస్సుకు నచ్చచెప్తూ ఉంది ఈ గీతంలో.

సర్వాంతర్యామియైన పరమాత్మ సాటిలేని సౌందర్య రాశి. ఆ సౌందర్యమంతా ఆయన పాదాలలోనే మూర్తీభవించి ఉంటుంది. పాదములకంటె పాదమూలం ప్రశస్తం. 'విష్ణుపాద నఖజ్యోత్స్నా పరబ్రహ్మేతి గీయతే' అని ఆర్యోక్తి. కాళ్ళ కంటె కాలి గోళ్ళలో పరంజ్యోతి ప్రకాశిస్తూ ఉంటుందట ! 'పాదో ఽస్య విశ్వా భూతాని' అని గదా శ్రుతి స్తుతిస్తుంది. ఈ ప్రపంచమంతా విరాట్‌పురుషుని పాదమాత్రమే. ఆ చరణస్పర్శ లభిస్తే చాలు, ప్రాపంచిక జీవిత పరమావధి

చేజిక్కినట్లే. ఆ పాదకమలసేవ లభించిన ధన్యజీవులు తాము తరిం చటమే కాక యితరులను కూడా తరింపజేస్తారు. 'అగమ తారణ తరణ్' అని చివరి చరణంలో మీరాబాయి యీ చరణ మహిమనే కొనియాడుతున్నది. 'స తరతి స తరతి లోకాం స్తారయతి.'

## 2

బసో మోరే నైనన్ మేం నందలాల్,
మోహనీ మూరతి సాంవరీ సూరతి, నైణా ఒనేబిసాల్ |
అధర సుధారస్ మురళీ రాజతి, ఉర్ బైజంతీ మాల్ |
మోర్ ముకుట్ మకరాకృత్ కుండల్, అరుణతిలక్ దియేభాల్ |
ఛుద్ర ఘంటికా కటితట్ సోభిత్, నూపురసబద్ రసాల్ |
మీరా ప్రభు సంతన్ సుఖదాయీ భక్తబఛల్ గోపాల్ ||

* * *

భక్తుల నయనాలు, భగవంతుని చరణాలు—నిర్మలమైన భక్తికి నిర్మించని భవనాలు, ప్రహ్లాదుడు, ధ్రువుడు, బలిచక్రవర్తి, గోకుల నివాసులు--సేవించి తరించిన శ్రీచరణ సంస్మరణ చేసిన తర్వాత మధురభక్తికి మారు పేరయిన మీరాబాయి ఆ శ్రీచరణరేణువునూ, ఆ మోహనాంగుని ముగ్ధ మనోహర రూపలావణ్యాన్నీ, ఆ నల్లనయ్య చక్కదనాన్నీ ఆ స్వామి విశాలనేత్రాలనూ, ఆ పెదవులలోని మృదు మధుర సుధారసాన్నీ తనివిదీర ఆస్వాదించి స్వరలహరిని ప్రసరింపజేసే పిల్లనగ్రోవినీ, ఆయన కంఠహారాన్నీ, నెమలిఫించంతో అమరిన కిరీటాన్నీ, మకరకుండలాల్నీ, నొసట తీర్చిదిద్దిన తిలకాన్నీ, ఘల్లుఘల్లుమని గజ్జెలతో కులుకుతూ మెలికలు తిరిగే ఆ కటితటాన్నీ, అందెలతో సందడి చేసే నందనందన పాదారవిందాలనూ -- అవి యివి యేమిటి భక్తవత్సలు డైన గోపాలుని రూప సర్వస్వాన్ని తన నేత్రాల్లో ఇముడ్చుకొని అనిర్వ

చనీయమైన ఆనందంలో మునిగిపోవాలని భక్తిపారవశ్యంతో ఏమేమో పాడుకొంటున్నది.

నందనందనుడు తన నయనాల్లో నిలిచిపోవాలని ఆమె ఉబలాటం. ఆ నయనాభిరాముని రూపలావణ్యం ఈ పాటలో కళ్ళకు కట్టే నట్టుగా చిన్న చిన్న మాటల్లో చిత్రింపబడింది. మనోహరమైన ఆకారం; శ్యామ సుందరమైన చాయ; విప్పారిన కళ్ళు; పాలుగారే పెదవులు; ఆ పెదవుల మీాద వేణువు; మెడలో వైజయంతీమాల; తలమీాద నెమ లిపింఛం; చెవులకు మకర కుండలాలు; నొసట ఎఱ్ఱని బొట్టు; గజ్జెలతో మారుమ్రోగే మొలనూలు; అందెలతో సందడి చేసే అడుగుల సవ్వడి; రస నిర్భరమైన పదసంపద—భక్తులకు పారవశ్యాన్ని ప్రసాదించే యీ పరమ రమణీయమైన రూపం మీారాబాయి వాక్కులలో వెలిసింది. నయనాల్లో నిలిచింది. అది ఆమె సొత్తు. ఆమె మాత్రమే దానికి సర్వాధికారిణి !

మామూలు మాటలతో నడిచిన యీ నాలుగయిదు చరణాల్లో శ్రీహరిచరణాలే ప్రచరించినట్టు తోస్తుంది. కన్నయ్యను కన్నుల్లో నిలుపుకొనవలెననే ఆలోచనలో ఎంత సారళ్య ముందో అంత గాంభీర్యమూ ఉంది. బాహ్య జగత్తులో కనిపించే భవ్య వైభవమంతా అంతరంగంలో ఉన్న రంగనాథుని చిద్విలాసమే. ఈ రెంటికీ మధ్య కవాటంలాగా కంటి రెప్పలు పనిచేస్తాయి. రెప్పలు వాలిస్తే లోపలి వెలుగు కనిపిస్తుంది. తెరిస్తే బాహ్యప్రపంచం కనిపిస్తుంది. మానవుడు మామూలుగా బయటి వెలుగును చూచి మురిసిపోతాడు. అంతకు మించిన ఆత్మ వైభవం తన అంతరంగంలో ఉన్నదని అతనికి తెలియదు. ఆ రహస్యం తెలిసిన మీారాబాయి ప్రపంచసారమైన ప్రభువును తన కండ్లల్లో ఉండిపొమ్మని ప్రార్థిస్తున్నది. నందనందనుడే నయనాల్లో నిలిచిపోతే ఎక్కడ చూచినా అతని రూపమే కనిపిస్తుంది.

'సర్వేంద్రియాణాం నయనం ప్రధానమ్' అన్నట్లు అందమంతా కండ్లల్లోనే ఉంటుంది. కండ్లు కండ్లను ఆకర్షిస్తాయి. ఈ ఆకర్షణే కృష్ణ చైతన్యం. దీనినే మీరాబాయి 'నందలాల్'గా రూపొందించింది. ఆకర్షణ కృష్ణలక్షణం, ఆనందం రామలక్షణం. బాహ్యాకర్షణలను అరికట్టి అంతర్ముఖ నయనాలతో అంతరాత్మను ధ్యానిస్తే అంతరంగంలోని శ్రీకృష్ణచైతన్యం అనుభవగమ్య మవుతుంది. ఈ రసదృష్టి లభించినవానికి అంతటా సర్వాంతర్యామిసౌందర్యమే కనిపిస్తుంది. రామభక్తులకు అంతా రామమయం అనిపిస్తుంది. కృష్ణభక్తులకు అంతా కృష్ణలీలాతరంగిణిగా భాసిస్తుంది. బ్రహ్మవేత్తలకు అంతటా బ్రహ్మపదార్థమే గోచరిస్తుంది. ఏ దృష్టితో చూచినా విశ్వమంతా విశ్వేశ్వరుని విచిత్ర విలాసంగా కనిపిస్తుంది. కాని దృష్టి నిర్మలంగా ఉండాలి. అందుకే మీరాబాయి తన నయనాలను నందనందనునికి ఆనందనిలయంగా అంకితం చేసి నిశ్చింతగా ఆడుతూ పాడుతూ జీవితం గడిపింది. జీవిత పరమావధిని సాధించింది.

"నేను ఎచట చూచినను నీవైయున్నది" అని ప్రపంచమంతటా వ్యాపించిన పరమాత్మస్వరూపాన్ని సాక్షాత్కరించుకొన్న త్యాగయ్యలో కూడా ఇలాంటి దృష్టివైశిష్ట్యం కనిపిస్తుంది. సహస్రపాదుని పాదాభివందనం చేసిన తర్వాత సహస్రాక్షుని తన నయనాల్లో నిలుపుకున్న మీరాబాయి తన ఆరాధ్యుని అందాన్ని పూర్తిగా అవగాహన చేసికొన్నదనే భావించవచ్చు.

## 3

జాగో బంసీవారేలలనా జాగో మోరే ప్యారే |

రజనీ బీతీ భోర్ భయోహై, ఘర్ ఘర్ ఖులే కివారే |

గోపీ దహీ మథత్ సునియత్ హై, కంగనాకే ఝుంకారే||

ఉఠోలాల్ జీ భోర్ భయోహై, సురనర ఠాఢే ద్వారే |

గ్వాల్ బాల్ సబ్ కరత్ కులాహల్, జయజయసబద్ ఉచారే |
మాఖన్ రోటీ హథ్‌మే లీనీ, గవ్వన్ కే రఖ వారే |
మీరా కే ప్రభు గిరిధర్ నాగర్, సరణ్ ఆయాకూం తారే ||

* * *

మీరా తన నేత్రాల్లో నిలుపుకొన్న ఆరాధ్యదైవం నిశ్చల సౌందర్య రాశి కాదు, నిరంతర కార్యదీక్షతో నిద్రాణమైన జగత్తును మేల్కొల్పే చైతన్యమూర్తి. శరణు కోరి వచ్చిన వారిని రక్షించే పరమకారుణ్యా పరుడు. అలాంటి ఆరాధ్య దేవతను మీరా యీ పాటలో మేల్కొల్పుతూ ఉంది.

గోపాలమూర్తి యింకా బాల్యదశలోనే ఉన్నాడు. పెరిగి పెద్ద వాడు కాలేదు. బరువుబాధ్యత లింకా బాగా తెలియలేదు. అందుకే అతను నిశ్చింతగా నిద్రపోతున్నాడు. రాత్రి అయిపోయింది. తెల్లవారింది. అందరూ తలుపులు తెరిచారు. గొల్లభామలు చల్ల చేస్తున్నారు. చల్ల చేసే చప్పుడుతోపాటు వాళ్ళ చేతుల్లోని గాజులు కూడా ధ్వని చేస్తున్నాయి. "ఇంతసేపు నిద్రపోతారా? లే కన్నయ్యా ! ఇక లే తండ్రీ ! తెల్లవారిందోయ్. నీకోసం చాలామంది వచ్చి బయట నిల బడి ఉన్నారు. దేవతలు కూడా వచ్చారు. నీతో ఆడుకొనేందుకు ఎంతమందో గొల్లపిల్లలు బయట చేరి అంతులేని అల్లరి చేస్తున్నారు. జయజయధ్వనులు చేస్తున్నారు. వెన్నరాచిన రొట్టెలు మూటగట్టుకొని ఆవుల మందలను తోలుకొని నీ తోటివాళ్ళంతా వెళుతున్నారు. నీవు కూడా లేచి పిల్లనగ్రోవి తీసుకుని వాళ్ళతో వెళ్ళు. నా కన్నతండ్రివి గదూ!"

ముఖ్యంగా మధురభావనతో మాధవుణ్ణే ఆరాధించే మీరాబాయి యీ పాటలో వాత్సల్యపూరితమైన దృశ్యాన్ని చిత్రించింది. పాదాభి

వందనకు సంబంధించిన మొదటి పాటలో దాస్యం, నయనాలయంలో నయనాభిరాముని నిలుపుకొనే రెండవ పాటలో మాధుర్యం, చిన్ని కన్న య్యను గారాబంతో మేల్కొల్పే యీ ప్రబోధగీతిలో వాత్సల్యం— బహుముఖమయిన మీరా భావమాధురిని వ్యక్తపరుస్తాయి. మీరా గీతాల్లో ఆత్మాభివ్యక్తికి సంబంధించిన పాటలే ఎక్కువగా కనిపిస్తాయి. కాని అక్కడక్కడ బాలగోపాలుని లీలలను వర్ణించిన ఘట్టాలు కూడా లేకపోలేదు. అందు కిది మచ్చుతునక. తల్లి యశోద పిల్లవాణ్ణి ఎలా మేల్కొలుపు తున్నదో యీ పాటలో గమనించవచ్చు. ఇంతకూ మన చాదస్తం కాని, అందరినీ నిద్రపుచ్చి తాను మేల్కొని స్వప్న జగత్తును సృష్టించే జగన్నియంతను మేల్కొల్పటమేమిటి? కాని యిక్కడ లీలా, వర్ణన ప్రధానం. యశోదకు కృష్ణుడు కుమారుడే. కన్నయ్యకు యశోద తల్లే. తల్లి కొడుకుల కది సహజం. భక్తుల కది లీలాగానం. భగవంతుని మేల్కొల్పుతూ పాడే పాటల్లో, సుప్రభాత సేవలో మరో రహస్యం కూడా ఉంది. మనలో నిద్రాణమై ఉన్న దివ్యత్వాన్ని మేల్కొల్పుకునేం దుకు ఇది చక్కగా ఉపకరిస్తుంది. అంతరంగంలోని సర్వాంతర్యామికి ఇది చక్కని మేలుకొలుపు.

## 4

చలో మన్ గంగా జమునా తీర్,

గంగా జమునా నిర్మల్ పానీ, సీతల్ హోత్ సరీర్

బంసీ బజావత్ గావత్ కాన్హో, సంగ్ లియాఁ బలవీర్ |

మోర్ ముగుట్ పీతాంబర్ సోహై, కుండల్ ఝలకత్ హీర్ |

మీరా కే ప్రభు గిరిధర్ నాగర్, చరణ కమల్ పై సీర్ ||

* * *

శ్రీకృష్ణుని బాలలీలకూ యమునాతీరానికీ అవినాభావ సంబంధముంది. మోహనాంగుని మురళీగానానికి యమునానది పొంగి పొరలినట్లు ప్రవహిస్తుంది. మీరాబాయి మధురభావన ఆమెను మానసికంగా యమునా తీరానికే కాదు, గంగా యమునా సంగమ స్థలానికి తీసుకువెళుతుంది. గంగా యమునలు కలిసే కమనీయమైన స్థానానికి పోదాం పదమని ఆమె తన మనస్సును ప్రేరేపిస్తుంది. ఎందుకు ? అక్కడేముంది? ఈ ప్రశ్నలకు ఆమె సమాధానం కూడా చెపుతుంది. గంగా యమునల్లో స్వచ్ఛమైన నీరు ప్రవహిస్తుందట. ఆ నీరు చల్లగా ఉంటుందట. ఆ చల్లదనానికి శరీరంలోని భౌతిక తాపం శాంతిస్తుందట. నిర్మలమైన చల్లని నీటికి శారీరక శాంతి లభిస్తే, యమునా తీరంలో మురళి వాయిస్తూ గోవిందుడు పాడే పాటలకు మనస్సుకూడా హాయిగా ఉంటుందట. బాలకృష్ణునితో పాటు అన్న బలరాముడు కూడా యమునా తీరంలోనే హాయిగా స్థాయిగా విహరిస్తుంటాడట. కృష్ణుని తలమీద నెమలిపింఛం కిరీటంలా మెరుస్తూ ఉంటుందట, ఒంటిమీద పీతాంబరం, చెవులకు వజ్రకుండలాలు విలక్షణమైన శోభను సమకూర్చుతాయట. మీరా తన హృదయ మనోహరుడైన గిరిధరుని చరణసన్నిధిని తలజేర్చి నమస్కరిస్తుంది.

సామాన్యంగా యమునాతీరంలో కృష్ణలీలలను వర్ణించటం భక్తకవులకు పరిపాటి. కాని మీరాబాయి యీపాటలో వర్ణించింది కేవలం యమునాతీరం కాదు. గంగా యమునల సంగమం ప్రస్తుతింపబడింది. ఇది విచిత్రమైన రసశిల్పం. కృష్ణుడు ఎప్పుడైనా గంగాయమునలు కలిసే చోటికివెళ్ళాడా? లేక శ్రీకృష్ణుడు యమునాతీర విహారం చేస్తున్నాడు కాబట్టి గంగ కూడా అక్కడికే వచ్చిందా? ఇది ఒక చిక్కుప్రశ్న. ఈ సందర్భంలో సూరదాసు గేయం ఒకటి గుర్తువస్తుంది. హరినామ స్మరణ ఎక్కడ జరిగితే అన్ని నదులూ అక్కడికి వస్తాయన్నాడు భక్తశిఖామణి సూరదాసు. గంగా గోదావరులు కూడా అక్కడికి అవిలం

బంగా చేరుకుంటాయట. మరి హరిని స్మరించినంత మాత్రాన సకల తీర్థ సమాగమం సాధ్యమయినప్పుడు సాక్షాత్ శ్రీకృష్ణుడు విహరించే యమునాతీరంలో గంగ కూడా ప్రవహిస్తున్నదనేందుకు సందేహం లేదు గదా!

మరో విశేష మేమంటే యిక్కడ శ్రీకృష్ణుదు బలరామునితో యమునాతీరంలో విహరిస్తున్నాడు. గోపికలతో కాదు. కాబట్టి యిది ప్రేయసీ ప్రియుల స్వైరవిహారం కాదు. అన్నదమ్ముల ఆనంద యాత్ర. రామకృష్ణుల కలయిక గంగా యమునా సంగమంగా రూపొందింది. శౌర్యమూ, సౌందర్యమూ కలిసిన యీ విచిత్ర సన్నివేశాన్ని మీరాబాయి మృదుమధురమైన పదజాలంతో వర్ణించింది. ఇది వివేకయుక్తమైన ప్రేమ. జ్ఞానంతో కూడిన భక్తి. శౌర్యంతో కూడిన సౌందర్యం.

## అనురాగం

### 1

మేరే తో గిరిధర్ గోపాల్, దూసరో న కోయీ:
జాకే సిర్ మోర్ ముకుట్ మేరే పతి సోయీ:
ఛాండి దయీ కుల్‌కీకాని, కహా కరిహై కోయీ:
సంతన్ ఢిగ్ బైఠి బైఠి, లోక్ లాజ్ ఖోయీ:
అసువన్ జల్ సీంచి సీంచి, ప్రేమ బేలి బోయీ:
అబ్‌తో బేల్ ఫైల్‌గయీ, ఆణంద్ ఫల్ హోయీ:
భగత్ దేఖి రాజి హుయీ. జగత్ దేఖి రోయీ:
దాసి మీరా లాల్ గిరిధర్, తారో అబ్ మోహీ ||

* * *

"గోవర్ధన గిరినెత్తిన గోపాలుడు నావాడు. నాకు కావలసిన వాడూ, నేను కోరినవాడూ వాడొక్కడే. మరెవ్వరితో నాకు సంబంధములేదు. తలమీద నెమలిపింఛం కిరీటంగా పెట్టుకొన్న ఆ గోపాలుడే నాభర్త" అని స్పష్టంగా చాటి చెపుతుంది అనన్యరాగయోగిని మీరాబాయి. చిన్నప్పటినుంచి మీరాబాయికి గిరిధరుడే చెలికాడు. ఆ తర్వాత అతడే ప్రియుడు. లోకాచారం ప్రకారం భోజరాజును పెండ్లాడినా భర్తతో శారీరకమైన సంబంధమే కాని ఆమె మనసారా ప్రేమించింది మథురాపతినే. కొద్దిరోజులకే లౌకికమైన ఆ ప్రేమానుబంధం కూడా విచ్ఛిన్నమయిపోయింది. ఆ తర్వాత మీరా పూర్తిగా గిరిధారిని తన భర్తగా భావించి సేవించింది. తాను జీవించి ఉండగా కాబోలు ఆమెకొక ఆలయం కట్టించి పెట్టాడు భర్త. ఎక్కువ సమయం ఆమె ఆ మందిరంలోనే మథురానాథుని కీర్తిస్తూ కాలక్షేపం చేస్తూ ఉండేది. వచ్చే పోయే భక్తులూ, బైరాగులూ, సాధులూ, సన్న్యాసులూ మీరాబాయి భక్తిగీతాలు వింటూ ఆమెతో సత్కాలక్షేపం చేసేవాళ్లు. మీరాబాయి కూడా తాను రాజకుమారిని అనే భావం లేకుండా భక్తి పారవశ్యంతో అందరిముందూ చిందులు తొక్కుతూ పాటలు పాడుతూ ఉండేది. ఇదంతా ఆమె మరుదులకూ, అత్తవారికీ, మామగారికీ, నచ్చేదికాదు. మహారాణా విక్రమజిత్ సింగు (మీరా మరది) మీరాబాయి ప్రవర్తనను సహించలేక ఆమెను చాలా బాధలు పెట్టాడట. విక్రమజిత్ సింగు తర్వాత ఉదయసింగు మేవాడు రాజ్యానికి ఉత్తారాధికారి అయిన తర్వాత కూడా పరిస్థితులలో మార్పు రాలేదు. నయానా, భయానా మీరాబాయిని ఎలాగయినా భగవద్విషయం నుంచి మరల్చాలని చాలా మంది ప్రయత్నించారు. కాని అలా ప్రయత్నించేందుకు రాణా పంపున వచ్చినవారు కూడా మీరాధోరణిలోనే చేరారు కాని, మీరా మారలేదు. ఈ పరిస్థితులనే మీరాబాయి యీ పాటలో వివరిస్తున్నది.

కుల మర్యాదలను లెక్క చేయని మాట నిజమే. కాని గోకులపతి ముందు కులమెంత? సాధువులతో కలిసి సత్కాలక్షేపం చెయ్యటం కులమర్యాదలకు విరుద్ధమయితే తానేం చెయ్యగలదు! సిగ్గువదలి శ్రీకృష్ణుని సేవించిన గోపికలు ఆమెకు ఆదర్శం. వారి అడుగుజాడల్లోనే తాను నడుస్తూ ఉంది. లోకనాథని ఆరాధించటంలో తప్పేమిటని ఆమె వాదం. అశ్రుధారలతో తడిపి ఆమె తన ప్రేమవల్లరిని పెంచిందట. ఇప్పుడా తీగె బాగా అల్లుకునిపోయింది. కొద్దిరోజుల్లోనే ఆ తీగెకు ఆనందమనే పండు కాస్తుందని ఆమెకు గట్టి నమ్మకం ఉంది. కాబట్టి ఇప్పుడా ప్రేమలతను త్రుంచివేయటం తెలివి తక్కువ. ఆనందాన్ని అనుభవించాలంటే అశ్రుధారలు రాలాలి. అశ్రుధారలతోనే అనురాగం వృద్ధిపొందుతుంది. ప్రేమకు మెరుగులు పెట్టేది ప్రియ విరహమే కాని ప్రియసమాగమం కాదు. విరహతాపంలో తపించినప్పుడే ప్రేమ విశుద్ధ కాంతిని సంతరించుకుంటుంది.

సంకుచిత దృక్పథంతో సాత్త్వికమైన ప్రేమను అర్థం చేసుకోలేని సమాజాన్ని చూచి మీరాబాయికి జాలివేస్తుంది. కాని భక్తసమాజాన్ని చూస్తే ఎక్కడలేని ఆవేశం, ఆనందం కలుగుతుంది. కాబట్టే క్రమంగా ఆమెకు ప్రపంచంమీాద విరక్తీ, భగవంతునిమీాద ఆసక్తీ పెరగసాగింది. ఇలా ప్రపంచం, భక్తీ— ఈ రెండింటికీ మధ్య నలిగిపోతున్న భక్తురాలయిన తన్ను కాపాడే ఒక తరణోపాయం చూపించమని ఆరాధ్య దైవమయిన గిరిధర గోపాలుణ్ణి అర్థిస్తుంది ఆమె.

మీరాగీతా లన్నింటిలో ఇది చాలా ప్రసిద్ధి కెక్కిందని చెప్పవచ్చు. అందువల్ల మధ్య మధ్య కొన్ని పంక్తులు తమంతట తాము చేర్చి పాడుకోవటంగూడా గాయకులకు అలవాటయింది. 'తాత మాత భ్రాత బంధు అపనా నహీ కోయీ' లాంటి చరణాలు మధ్య మధ్య చేర్చి చాలామంది పాడుతుంటారు. దీనినిబట్టే మీరా మాధురిలో జనభారతిని సమీకరించుకొనే శక్తి ఉన్నదని స్పష్టమవుతుంది.

## 2

మైఁతో గిరిధర్‌కే ఘర్ జావూఁ
గిరిధర్ మ్హారో సాంచోప్రీతమ్, దేఖత్ రూప్ లు భావూఁ
రైణ్‌పడే తబ్‌హీ ఉఠిజావూఁ భోర్‌గయే ఉఠి ఆవూఁ |
రైణ్ దినా వాకే సంగ్ ఖేలూఁ జ్యూఁజ్యూఁ వాహిరి ఝావూఁ |
జోపహిరావై సోయీపహిరూఁ జోదే సోయీ ఖావూఁ |
మేరీ ఉన్‌కే ప్రీత్ పురాణీ, ఉణ్‌బిని పల్ న రహావూఁ |
జహాఁ బైఠావే తిత్‌హీ బైఠూఁ బేచే తో బిక్ జావూఁ |
మీరాకే ప్రభు గిరిధర్‌నాగర్, బార్ బార్ బలి జావూఁ |

* * *

గిరిధారిని గాఢంగా ప్రేమించిన మీరాబాయి తాను భర్త యింటికి వెళ్ళి అక్కడ ఎలా ఉండాలని ఊహిస్తున్నదో యీ పాటలో చెపుతుంది:

నేను గిరిధరుని యింటికి వెళ్ళి తీరుతాను. గిరిధరుడే నాకు నిజమైన ప్రియతముడు. మాది నిజమైన అనురాగం. నా హృదయేశ్వరుని మనోహర రూపలావణ్యం చూచినకొద్దీ నాకు మాటిమాటికీ చూడాలనిపిస్తుంది. మగువ మనస్సును మరులుకొల్పే ఆ దివ్యమంగళ విగ్రహం నిత్యనూతనం, చిరరమణీయం. చీకటి పడగానే నేను నా ప్రియుని యిల్లు చేరుకుంటాను. మళ్ళీ తెల్లవారితే గాని తిరిగిరాను. రాత్రేకాదు, వీలయితే రాత్రింబవళ్ళు మొత్తం ఆయనతో ఆడుతూ పాడుతూ హాయిగా గడపాలని ఉంది. ఆ ముగ్ధమనోహర సుందరమూర్తిని మురిపించేందుకు నే నేమైనా చేస్తాను. ఆయన ముఖంలో చిరునవ్వు చిందితే నేను ఆనందంతో పొంగిపోతాను. మా అనురాగానికి ఆనందమే ప్రతిఫలం. అందం ఆధారం. అంతేకాని ఆయన వల్ల నాకేవో భోగభాగ్యాలు లభించవలెననే లోభం నాకు లేదు. అన్నవస్త్రాల మీద

ఆసక్తి లేదు. ఐహిక సుఖాల మీద అపేక్ష అసలే లేదు. ఎలాంటి గుడ్డలు ఆయన నాకు తెచ్చిస్తే అవే పట్టు పీతాంబరాలని భావించి ప్రేమతో కట్టుకుంటాను. తినేందుకు ఆయన ఎలాంటి వస్తువులు తెస్తే అవే షడ్రసోపేతము లయిన వ్యంజనములుగా భావించి నేను తృప్తిగా భుజిస్తాను. ఎక్కడ కూర్చోమంటే అక్కడే కూర్చుంటాను. అక్కర లేదని అమ్మేస్తే అమ్ముడుపోతాను. నన్ను ఏలుకున్నా, అమ్ముకున్నా నామీద అన్ని హక్కులూ ఆయనవే. దాన విక్రయాధికారాలతో జన్మ జన్మాంతరాల వరకూ నేను ఆయనకు స్వాధీనమై పోయాను. మా సంబంధం ఈ నాటిది కాదు. అది నిత్య నూతనం, పరమ పురాతనం. ఈ సనాతన సంబంధం ఒక్క నాటితో ఒక్క మాటతో విడిపోయేది కాదు. ఆయన నా దగ్గరలేని క్షణం నాది కాదు. ఆయన లేకుండా గడియ కూడా గడవదు. నా స్వామి నా శ్వాస. నా స్వామి నా ఆశ. స్వామిని చూచిన కొద్దీ, మరి మరీ చూడాలని పిస్తుంది. నా స్వామే నా సర్వస్వం.

ప్రియుని దగ్గరికే రాత్రి వెళ్ళి ఉదయం తిరిగి రావటంలో 'యా నిశా సర్వభూతానాం తస్యాం జాగర్తి సంయమీ' అనే గీతా వాక్యం ధ్వనిస్తుంది. తన ప్రియుని యిష్టమే తన యిష్టమని చెప్పే మీరా పాటల్లో గీతలో చెప్పిన "యదృచ్ఛాలాభ సంతుష్టి" స్పష్టంగా గోచరిస్తుంది.

## 3

మైఁ గిరిధర్ రంగ్‌రాతీ, సైయాఁ మైఁ గిరిధర్ రంగ్‌రాతీ ।
పఁచరంగ్ చోలా పహర్ సఖీ మైఁ, ఝిర్‌మిట్ ఖేలన్ జాతీ ।
ఓహ్ ఝిర్‌మిట్ మాఁ మిల్యోసాఁవరో, ఖోల్ మిలీ తన్ గాతీ ।
జిన్‌కా పియా పరదేస్ బసత్ హై, లిఖ్ లిఖ్ భేజైఁ పాతీ, ।

మేరా పియా మేరే హీయ బసత్ హై, నా కహూఁ ఆతీ జాతీ |
చందా జాయగా సూరజ్ జాయగా, జాయగీ ధరణీ అకాసీ |
పవన్ పాణీ దోనుఁ హీ జాయంగే, అటల్ రహై అవినాసీ |
సురత్ నిరత్‌కా దివలా సంజోలే, మనసా కీ కరలే బాతీ |
ప్రేమ్ హటీ కా తేల్ మంగాలే, జగే రహ్యా దిన్ తే రాతీ |
సత్ గురు మిలియా సాంసా భాగ్యా, సైన్ బతాయీ సాంచీ |
నా ఘర్ తేరా నా ఘర్ మేరా, గావై మీరా దాసీ ||

* * *

బాహ్య దృష్టికి మీరా ప్రేమ లౌకికంగా కనిపించినా నిజానికి అది ఆధ్యాత్మికమైన ఆత్మ సమర్పణ. ఈ విషయాన్ని ఈ పాటలో గమనించవచ్చు:-

గిరిధారి మీద నాకు గురి కుదిరింది. ఆయన మనస్సులో నా మనస్సు లీనమై పోయింది. అయిదు వన్నెల కాషాయపు చీరె కట్టుకుని నేను నా ప్రియునితో దాగుడుమూతలు ఆడుకునేందుకు వెళ్ళాను. మాయలాడి మాధవుడుకూడా ఎన్నో మారువేషాలు వేసుకుని నన్ను ఆడించేందుకు చూచాడు. కాని ముసుగులో దాగియున్న అసలు రూపం తెలిసిపోయింది. గుట్టు బయటపడగానే తనివిదీరా మా తనువులు అనురాగంలో రంగరించుకొని తన్మయత్వం చెందాయి. నా ప్రియుని జాడ తెలియక నేను ఎక్కడెక్కడో వెదికాను. చివరకు అతడు నా హృదయంలోనే ఉన్నాడని తెలిసింది. ఎక్కడో ఉన్న ప్రియుని కయితే ఉత్తర ప్రత్యుత్తరాలు అవసరం. నా ప్రియుడు నాలోనే నెలకొని ఉండటం వల్ల మరోచోటికి వెళ్ళవలసిన పని లేదు. నే నెక్కడ ఉంటే నా ప్రియుడు కూడా నా చెంతనే ఉంటాడు. ఆయన నన్ను విడిచి ఎప్పటికీ ఎక్కడికీ వెళ్ళడు. సూర్యచంద్రులు నశించవచ్చు. భూమ్యాకాశాలు అంతరించవచ్చు. గాలి కనిపించకుండా కాలంలో కలిసిపోవచ్చు. నీరంతా

చుక్క లేకుండా ఇంకి పోవచ్చు. కాని నా ప్రియుడు మాత్రం నశించడు, కృశించడు, ఇంకడు, కుంకడు. ప్రాపంచిక విషయముల మీద విరక్తి, పారమార్థిక వ్యాసంగం మీద ఆసక్తి--రెండింటినీ మేళవించి మనస్సనే వత్తిని ప్రేమ వీథినుంచి తెచ్చిన నూనెతో తడిపి దీపం వెలిగిస్తాను. ఈ దీపం రేయింబవళ్ళు వెలుగుతుంది. స్నేహధార అవిచ్ఛిన్నంగా ఉన్నంతవరకు అనురాగదీపం అఖండంగా వెలుగుతూనే ఉంటుంది.

సద్గురువు లభించాడు. సందేహాలన్నీ నశించాయి. సరియైన గుర్తు దొరికింది. ఇక లక్ష్యం చేరటంలో సందేహం లేదు. ఇంతవరకూ నా యిల్లని భావించిన అందాలమేడ మనదెవ్వరిదీ కాదని తెలిసింది. అసలు చేరవలసిన యిల్లు గుర్తు తెలిసింది. మీరాకు పూర్తిగా గిరిధారి మీద గురి కుదిరింది.

పచ్ రంగ్ చోలా (అయిదు వన్నెల కాషాయవస్త్రం) శబ్ద స్పర్శ రూప రస గంధాలతో కూడిన మానవ శరీరమే. శరీరం మాయావరణం. ఈ శరీరంలోని శరీరిని కనుగొనటమే ఆత్మసాక్షాత్కారం. ఆత్మ నశించదు. సూర్యచంద్రులు ప్రకాశించని మరుస్థలంలో, అగ్ని ప్రజ్వలించని ఆలోక లోకంలో ఆత్మజ్యోతి వెలుగుతుంది. అదే పరమాత్మ నివసించే పరంధామం. అదే మీరాకు గమ్యస్థానం.

## 4

పగ్ ఘుంఘురూ బాంధి మీరా నాచీ రే |
మైఁతో మేరే నారాయణ్ కీ ఆపహి హోగయి దాసీ రే |
లోగ్ కహైఁ మీరా భయి భావరీ, న్యాత్ కహైఁకుల నాసీ రే |
విషకా ప్యాలా రాణా భేజ్యా, పీవత్ మీరా హాసీ రే |
మీరా కే ప్రభు గిరిధర్ నాగర్, సహజ మిలే అవినాసీ రే ||

* * *

అందెల కాళ్ళతో ఆనందంతో పరవశించి మీరా నృత్యం చేస్తూ ఉన్నది. తనకు తన నారాయణుడు దొరికాడు కదా అని ఆమె తన్మయత్వంతో చిందులు తొక్కుతున్నది. సాక్షాత్ శ్రీమన్నారాయణుడు తనకు భర్తగా లభించాడు. ఆమె ఆనందానికి మేరలేకుండా పోయింది. అప్రయత్నంగా ఆమె ఆయనకు దాసి అయిపోయింది. ఎంత ప్రయత్నిస్తేనో గాని అలాంటి భర్త లభించడు. కాని మీరా అదృష్టం వల్ల పురుషోత్తముడు ఆమెకు సహజంగా దొరికాడు. ఈ ఆనందంతో ఆమె మైమరచిపోయి ఆడుతూ పాడుతూ చిందులు తొక్కుతూ ఉంటే ప్రజలందరూ ఆమెకు పిచ్చి పట్టిందని అనుకోసాగారు. చుట్టాలూ, పక్కాలూ ఈమె నిక్షేపంలాంటి కుటుంబంలో నిప్పు పెట్టిందనీ, కుల మర్యాదలను కూలద్రోసిందనీ అనరాని మాటలు అన్నారు. మాటలతో పోలేదు. ఇంటిపేరు మంటగలిపిన యీ మీరా ఉంటే యెంత పోతే యెంత అని తలచి కులగౌరవానికి విలువనిచ్చే రాణా మీరాకు విషం పంపించాడు. మీరా విషపాత్రను చూచి నవ్వుకున్నది. నారాయణ నామసంకీర్తనతో సేవించిన ఆ విషం కూడా ఆమెకు పీయూషంగా పరిణమించింది. మాధవునిపై మరులుకొన్న మీరా మనస్సును మరలించుటం అంతసులభం కాదని రాణా గమనించాడు.

కాని అంతటితో రాణా తన ప్రయత్నం చాలించలేదు. రాణా పెట్టిన నానాబాధలు మీరా మరోపాటలో వివరంగా వర్ణిస్తుంది. రాణా పాములబుట్ట పంపించాడట. మీరా స్నానం చేసి బుట్ట తెరచిచూస్తే అందులో సాలగ్రామం కనిపించిందట. ముళ్ళమంచం రాణా పంపించాడట. అది మీరాకు పూలపాన్పయిందట. భగవదీయులకు భవబాధలు సోకవనేందుకు చక్కని నిదర్శనం మీరాకు లభించింది. ఆమెకు నారాయణుని మీదగల అనురాగం మరింత పెరగసాగింది.

# 5

"శ్రీ గిరిధర్ ఆగే నాచూంగీ
నాచి నాచి పివరసిక్ రిఝావ్వూం, ప్రేమీజన్ కూంజాచూంగీ |
ప్రేమ ప్రీతికీ బాంధి ఘుంఘురూ, సురత్ కీ కఛనీ కాఛూంగీ |
లోక్ లాజ్ కుల్ కీ మర్జాదా, యామై ఏక్ న రాఖూంగీ |
పివ్ కే పలంగా జా పౌఢూంగీ, మీరా హరిరంగ్ రాచూంగీ ||

* * *

ఆరు నూరయినా నూ రారయినా మీరా గిరిధారిని మాత్రం వదలదు. ఆయన యెదుటనే ఆమె నృత్యంచెయ్యాలి. ఆనందంతో పర వశించి నాట్యమాడాలి. నాట్యంచేసి తన నాథుని మెప్పును పొందాలి. ఆమె ప్రియుడు ఆరితేరిన రసికుడు. ఆటలోని అందం, పాటలోని పాటవం అతనికి తెలిసినట్టుగా మరొకరికి తెలియదు. ఆయన రస జ్ఞుడే కాదు, రసస్వరూపుడుకూడా. కాబట్టి ఆయన మెప్పును పొందటం నృత్యంలో ఆరితేరిన మీరాకు సులభం. మీరా తన ప్రియుని నాట్యంతో తృప్తిపరచి అతణ్ణి ప్రేమభిక్ష అడుగుతుంది. ఘల్లుఘల్లుమని మ్రోగే ఆమె గజ్జెలుకూడా ప్రేమనే ధ్వనింపజేస్తాయి. ఆమె ధరించిన వస్త్రాలూ, కట్టుకున్న మొలకట్టూ కూడా ఆమెకు తన ప్రియునిమీదగల ఆస క్తినే తెలియపరుస్తాయి. ఆమె బట్టలు శరీరాన్ని ఎంతగట్టిగా పట్టుకొని యున్నాయో ఆమె మనస్సు మాధవునిమీద అంత గాఢంగా లగ్నమై ఉంది. ప్రియునిమీద ఆమెకుగల ఆసక్తినిచూచి సహించలేని చుప్ప నాతి ప్రపంచం ఆమెను తూలనాడవచ్చు. కాని ఆమె లోకాపవాదాన్ని లెక్కచెయ్యదలచుకోలేదు. మాధవుని మధురానురాగం ముందు ఆమెకు కులమర్యాద లెక్కలోదికాదు. ఎవరేమనుకున్నా సరే ఆమె నేరుగా వెళ్ళి ప్రియుని పాన్పు మీద చేరి హాయిగా శయనిస్తుంది. తానే ప్రియుడు; ప్రియుడే తాను అన్నట్టుగా ఆమె ఆయనలో లీనమైపోతుంది.

ఈపాటలో మీరా వర్ణించిన నృత్యం, పాన్పు, ప్రేమ పారవశ్యం -- అన్నీ సర్వాంతర్యామియైన శ్రీకృష్ణపరమాత్మ పరమైనవే అని వేరే చెప్పనక్కరలేదు. కన్నయ్యను కలలో పెళ్ళిచేసుకున్న మీరాకు అంతరంగంలో అంతరాత్మను లాలించటం అసాధ్యం కాదు.

# ఆవేదన

## 1

తనక్ హరి చితవాజీ మోరీ ఓర్,
హమ్ చితవత్ తుమ్ చితవత్‌నాహీఁ, దిల్‌కే బడే కఠోర్ |
మేరే ఆసా చితవని తుమరీ, ఔర్ నదూజీ దోర్
తుమ్‌సే హమ్‌కూ కబర్ మిలోగే, హమ్‌సీలాఖ్ కరోర్
ఊభీఠాఢీ అరజ్‌కరత్ హూఁ అరజ్‌కరత్ భయేభోర్
మీరాకేప్రభు హరి అబినాసీ, దేస్యూఁప్రాణ్ అకోర్ ||

* * *

ఆరాధ్యుని అందానికి మురిసిమురిసి, తన అనురాగాన్ని ఆ అందాల రాశికి తెలిపి తెలిపి మీరాబాయికి విసుగువేసింది. అయినా ఆమె మొర హరిచెవిని పడినట్లుగా కనిపించదు. ఇంతవరకూ ఆ కఠోరహృదయుడు ఆమెవైపు చూచినట్లుగా కూడా లేదు. మీరా మాత్రం పాడింది పాడినట్లే, చూచింది చూచినట్లే ఎదురుచూపులకోసం ఎదురు చూస్తూ నిలబడి పోయింది. "ఒక్కసారి నావైపు చూస్తే నీ సొమ్ములు పోతాయా?" అని ఆమె నిష్ఠూరంగా భగవంతునితో విన్నవించుకుంటూ ఉంది. కాని ఆమె చూపులు మాత్రం చూడవలసిన సౌందర్యరాశి వైపు ఏకాగ్రంగా ఏకధాటిగా (One way traffic) ప్రసరిస్తూనే ఉన్నాయి.

ఎప్పటికయినా నందనందనుడు నయనానందకరమైన తన నయనాలను ఆమెవైపు మరల్చకపోతాడా అనే ఆశతో ఆమె అశాంతంగా ఆవేదనతో నిరీక్షిస్తూనే ఉంది. ఒకరి నొకరు చూచుకొని పరమానందంతో పరవశించి పోయే పరమరమణీయమైన క్షణం రాకమానదని ఆమెకు గట్టినమ్మకం. ప్రస్తుతం ప్రియు డెంత ఉపేక్షిస్తున్నాడో తెలిసికూడా ఆమె ఆశలు వదలుకోలేదు. మరోమార్గంకూడా కనిపించటంలేదు. హరి ఒక్కడే ఆమెకు దిక్కు. ఆమె ఆశలన్నీ అతనిమీదనే కేంద్రీకృతమైవున్నాయి. కాని హరికి మీరాలాంటివాళ్ళు ఎందరో ఉన్నారు. ఎంతకాలాని కయినా సరే సర్వేశ్వరుని కృపాదృష్టి మీరాబాయి మీదికి ప్రసరించాలి; ఆమె తరించాలి. ఈ సంగతి తెలిసే కాబోలు తెలివిగల గోపాలుడు తప్పించుకు తిరుగుతున్నాడు. కాని ప్రభువు కనిపించకపోతే మీరాదాసికి నిద్రపట్టదు. ఒంటికాలి మీద నిలబడి రాత్రంతా జాగరణచేస్తుంది. హరినామ సంస్మరణతో రాత్రంతా గడిచిపోతుంది. తెల్లవారుతుంది. కాని మీరాకోరిక నెరవేరదు. ఇలా ఎన్ని రాత్రులు, ఎన్ని గడియలు గడవాలో! మరో విశేషమేమంటే మీరా జీవితం క్షణభంగురం. మీరా కోరిన హరి సనాతనుడు. శరీరం కాలపరాధీనం. శరీరధారిని నడిపించే గిరిధారి కాలాతీతుడు. అందుకని మీరా తన శరీరంలోని ప్రాణాలను కానుకగా ఇస్తానంటుంది. ప్రాణాలుపోయినా ప్రాణనాథుని అనురాగం లభిస్తే చాలునని మీరా ఆరాటం.

'ఇహ చే దవేదీ దథ సత్యమస్తి, న చే దిహావేదీ న్మహతీ వినష్టిః' (శరీరంలో ప్రాణాలు ఉండగానే ప్రాణపతి అడుగజాడలను కనిపెట్టాలి. లేకుంటే అది తీరని హాని అవుతుంది) అని శ్రుతి. అందుకే మీరా ఆరాటపడుతుంది. జీవితంలో ఒక్కసారి హరి తనవైపు చూస్తే చాలట. ఇలాగే తులసీదాసుకూడా ఒక్కసారి ప్రభువు తనను తనవాడని అంటే చాలు నంటాడు.

# 2

"జోగీ మత్ జా మత్ జా మత్ జా
　　పాయి పరూఁమైఁ చేరీ తేరీ హూఁ |
ప్రేమ భగతికో పైండో హీ న్యారా
　　హమ్‌కూ గైల్ బతా జా|
అగర్ చందన్ కీ చితా బణావూఁ
　　అపణే హాథ్ జలా జా!
జల్ బల్ భయీా భస్మకీ ఢేరీ
　　అపణే అంగ్ లగా జా |
మీరా కహై ప్రభు గిరిధర్ నాగర్
　　జోత్ మేఁ జోత్ మిలాజా ||

* * *

భక్తులకు భగవంతుని చేరేమార్గం చూపించేవాడు యోగి. ఆత్మమనస్సంయోగమే యోగం. ఎన్ని జన్మల తపస్సు ఫలిస్తేనోకాని అలాంటి యోగి లభించడు. యోగ్యుడయిన యోగిని ఎలాగో తన జీవితంలో సాక్షాత్కరించుకున్న మీరాబాయి అతని సాన్నిధ్యాన్ని సద్వినియోగం చేసుకోవాలని పరితపిస్తూ ఈ పాటపాడింది.

దారినిపోయే యోగిని అలా ఉపేక్షించి వెళ్ళవద్దు, వెళ్ళవద్దు, వెళ్ళవద్దని ఆమె పరిపరివిధాల బతిమాలుతూ ఉంది. "నీ కాళ్ళకు మొక్కుతాను, నీకు పరిచర్యలు చేస్తాను. నాకు కొంచెం దారి చూపించి యీ సందులుగొందులు దాటి రాజమార్గం చేరే సదుపాయం చెప్పు. ఏం చెయ్యమంటే అది చేస్తాను. ప్రాణాలనయినా అర్పిస్తాను. చందనం, సాంబ్రాణి మొదలయిన సుగంధద్రవ్యాలతో చితి పేరుస్తాను. అందులో నేను ప్రవేశిస్తాను. నీవు నీ చేతులతోనే చిచ్చు రగుల్చు. నశ్వర మైన శరీరం నశించిపోతుంది. బూడిద మిగులుతుంది. ఆ

భస్మం నీవు ధరిస్తే నా జన్మ తరిస్తుంది. భస్మరూపంలో నయినా సరే నేను భాగవతోత్తములను సేవించగలుగుతాను. భాగవతసేవే నిజమైన భగవత్సేవ. నా శరీరం ప్రజ్వరించినప్పుడు నాలోని జ్యోతి పరంజ్యోతిలో ప్రవేశిస్తుంది. జ్యోతిని జ్యోతిలో చేర్చేందుకు నీ సాయం చాలా అవసరం. కాబట్టి అప్పుడే నీవు వెళ్ళవద్దు. నాకు దారి చూపించకుండా వెళ్ళవద్దు. అసలే యీ భక్తిమార్గం చాలా ఇరుకయినది. నన్నీ యిరుకులో వదలిపెట్టి వెళ్ళటం నీకు భావ్యం కాదు. తపించగా తపించగా పరితపించగా పరితపించగా కానిపించిన నీవు నన్ను తరింపజేయకుండా వెళ్ళవద్దు, వెళ్ళవద్దు, వెళ్ళవద్దు" అని మీరాబాయి ఆరాటంతో, ఆవేశంతో, ఆవేదనతో ఆరాధ్య దైవాన్ని చూపించగల ఆ యోగిని బతిమాలుతుంది.

'ప్రేమ భగతికో పైండోహి న్యారా' (ప్రేమ మార్గం – అంటే భక్తిమార్గం--చాలా విలక్షణమైనది) అనటంలో 'క్షురస్య ధారా నిశితా దురత్యయా దుర్గం పథస్తత్ కవయో వదంతి' అన్న శ్రుతివాక్యం ధ్వనిస్తుంది. యోగిమీది అనురాగం భావయోగిని మీరాను భగవంతుని సమీపానికి చేరుస్తుంది. నిజమైన యోగికీ, యోగీశ్వరుడైన పరమాత్మకూ సాధకుల దృష్టిలో తాత్త్వికమైన భేదం లేదు.

# 3

"ప్యారే దరసణ్ దీజ్యో ఆయ్, తుమ్ బిన్ రహ్యో నజాయ్
జల్ బిన్ కమల్, చంద్ బిన్ రజనీ, ఐసేతుమ్ దేఖ్యా బిన్ సజనీ |
వ్యాకుల్ వ్యాకుల్ ఫిరూఀ రైణ్ దిన్, బిరహ్ కలేజో ఖాయ్ |
దివస్ న భూఖ్, నీంద నహిఀ రైణా, ముఖసూఀకథతన ఆవై బైణా |
కహా కహూఀ, కుఛ్ కహతన ఆవై, మిల్ కర్ తపత్ బుఝాయి |

క్యాఁ తరసావో అంతర్ జామీ, ఆయ్ మిలో కిరపాకర్ స్వామీ |
మీరాదాసీ జనమ్ జనమ్‌కీ, పరీ తుమ్హారే పాయ్ ||

* * *

ఎంత వేడుకున్నా అంతర్యామి కనిపించడు. మీరాకు ఆరాటం పెరిగిపోతుంది. ప్రభువును చూడకుండా ఇక ఉండలేనని అనిపిస్తుంది. ఒక్కసారి నీ దర్శనభాగ్యం నాకు ప్రసాదించి నన్ను బ్రతికించవలసిందని పతిని ప్రార్థిస్తుంది:-"ప్రాణపతీ, నీవు లేకుండా నేనిక ఒక్కక్షణంకూడా జీవించలేను. నీరు లేని నీరజాల్లాగా, చంద్రుడులేని రాత్రిలాగా నీవు లేని నేను జీవించలేను. పగలనక రాత్రనక నీ దిగులుతో నా గుండే కుమిలి పోతుంది. పిచ్చిపట్టినట్లు రేయింబవళ్ళు నేను నీకోసం కాలుకాలిన పిల్లిలా తిరుగుతున్నాను. ఈ వేదన నా హృదయాన్ని తినివేస్తూ ఉంది. పగలు తిండిలేదు. రాత్రి నిద్రలేదు. నిద్రాహారాలను మరిపించే యీ ఆవేదన ఒకరికి చెప్పదగిందికాదు. చెప్పినా అర్థమయ్యేదికాదు. చెప్పాలంటే చాలా చెప్పాలి. ఎంతని చెప్పను? ఎవరికి చెప్పను? ఏమని చెప్పను? నిన్ను చూస్తేకాని నామనస్సు శాంతించదు. నా వేదన తీరదు. నా హృదయంలోనే ఉండి ఇంతగా మథించటం అంతర్యామివైన నీకు న్యాయమా? స్వామీ! ఆలస్యం చేయక, అనవసరంగా బాధించక, వెంటనే నీ దర్శనభాగ్యం ప్రసాదించు. మీరా యీనాటిది కాదు. జన్మజన్మాంతరములనుండీ నీ సేవకోసం ఎదురుచూస్తున్న పరిచారిక. నీ కాళ్ళకుమ్రొక్కి నీ చరణసేవకోసం పరితపిస్తున్నాను. త్వరగా దయచూడు."

మీరాబాయికే తన విరహవేదన చెప్పకునేందుకు నోటమాట రావటం లేదట ! కబీరుదాసుకూడా ఇలాగే తన కరుణకథను 'అకథ్ కహానీ' అంటాడు. చెప్పనలవిగాని గొప్ప వేదన కనక దానిని అంతర్యామి అర్థంచేసుకోవలసిందే కాని మరో మార్గం లేదు. ఆత్మతత్త్వం వాక్కుకు

చిక్కదు, మనస్సునకు అందదు. కాని అది శరీరంలోనే ఏదోమూలను, ఏదో రూపంలో ఒదిగి ఉన్నది. కాబట్టి ఆత్మవంతుడు తన ఆత్మ బలంతోనే తనలో ఉన్న అంతరాత్మను అవగాహన చేసుకోవాలి. తెలుసుకునేవ్యక్తి, తెలుసుకొనవలసిన తత్త్వం, తెలుసుకొనేప్రక్రియ — అంతా ఆత్మగతమే. ఇదే ఆత్మచింతనలో ఉన్న వింత ! తనలో దాగియున్న పరమాత్మ తనకు కనిపించదు. ఇంతకు మించిన వైచిత్రి మరొకటి ఉండదు. ఇలా పరమాత్మ జీవాత్మకు చేరువనే ఉంటూ దూరంగా ఉన్నట్లు భాసించటం కేవలం ఈ జన్మలోనే కాదు, జన్మ జన్మాంతరాలనుండీ యీ మహేంద్రజాలం ఇలాగే సాగుతూ ఉన్నది. భార్యాభర్తల కయినా మధ్య వ్యవధాన ముండవచ్చునుకాని జీవాత్మకూ పరమాత్మకూ ఆవగింజంత అంతరం కూడా లేదు. అందుకనే ఆత్మజ్ఞులకు పరమాత్మమీద ఉండే అనురాగం సామాన్యమయిన ప్రేమకాదు. దానినే నారదుడు పరమప్రేమరూపమయిన భక్తిఅంటాడు. కాని ఎంత ప్రేమకంత విరహం!

## 4

హేరీ మైఁ తో దరద్ దివాణీ హోయ్
        దరద్‌న జాణై మేరో కోయి|
ఘాయల్ కీ గతి ఘాయల్ జాణే
        కీ జిణ్ లాయీ హోయి|
జౌహరికీ గతి జౌహరి జాణై
        కీ జిన్ జోహర్ హోయి |
సూలీ ఊపర్ సేజ హమారీ
        సోవణ్ కిస్ విధ్ హోయి |
గగన్ మండల్ పై సేజ్ పియా కీ
        కిస్ విధ్ మిలణా హోయి |

దరద్ కీ మారీ బన్ బన్ డోలూఁ
బైద్ మిల్యా నహీఁ కోయి |
మీరాకే ప్రభు పీర్ మిటేగీ
జబ్ బైద్ సాఁ వలిగ్యా హోయి ||1

* * *

విరహావేదనతో మీరా విలపించిపోతున్నది. కాని ఆమె బాధ ఎవ్వరికీ బోధపడటంలేదు. అది బోధపడేది కూడా కాదు. అనుభవిస్తేనే కాని ఆ బాధ ఏమిటో ఎలాంటిదో తెలియదు. అలౌకికమైన బాధలే కాదు, లౌకికమైన బాధలు కూడా అనుభవించినవారికే అర్థమవుతాయి. శరీరంలో ఎక్కడనయినా గాయం తగిలితే గాయపడ్డవాళ్ళకు ఆ బాధ తెలుస్తుంది కాని చూచేవాళ్ళకు తెలియదు. కనీసం శస్త్ర చికిత్స చేసే వైద్యుడికి కూడా రోగిబాధ తెలియదు. గాయపరచినవాడికి అసలే బోధపడదు. అలాగే ఏ రత్నం ఎలాంటిదో దాని విలువ తెలిసిన వాళ్ళకే తెలుస్తుంది. సామాన్యుల దృష్టికి రత్నం కూడా ఒక రాయే. అదే విధంగా పరమాత్మ విరహంతో బాధపడే భక్తుల ఆవేదన అందరికీ ఎలా అర్థమవుతుంది ? భగవంతుని ప్రేమించిన భక్తులు ముళ్ళపాన్పుమీద పండుకుంటారట. మరి వాళ్ళకు నిద్ర ఎలా పడుతుంది? లౌకికమైన ప్రేమను సేవించే ప్రేయసీప్రియులకు ఈ ప్రేమతత్త్వం ఎంతమాత్రం బోధపడదు. ప్రియుని పాన్పు ఆకాశంలో అమర్చబడి ఉన్నదట. మరి ప్రియునితో సమాగమం ఎలా సాధ్యం? ఆకాశం శూన్యం. శూన్యంలో శయన సౌఖ్యం ఊహాతీతం. ఇలా అసాధ్యమైన ప్రేమను సాధించేందుకు కంకణం కట్టుకున్న మీరాబాయి నానాబాధలూ పడుతున్నది. తప్పదు. చేసుకొన్నవారికి చేసుకొన్నంత. అసలు సర్వాంతర్యామియైన వాసుదేవుణ్ణి వివాహం చేసుకోవాలని సంకల్పించటమే యీ విరహవేదనకు పునాది. ఈ బాధ ఎవ్వరికీ అర్థమయ్యేది కాదు. కాబట్టి ఎవ్వరూ తీర్చలేరు.

అనిర్వచనీయమైన ఆవేదనతో విరహిణి మీరాబాయి అడవుల పాల యింది. వ్యాధి గమనించి నయంచేసే వైద్యు డెక్కడా దొరకలేదు. ఇంతకీ దీనికి వైద్యు డొక్కడే ఉన్నాడు. అతడే వైకుంఠనాథుడు, మీరా కోరి వలచిన ఆరాధ్యదైవం ఆ గిరిధారే !

మీరా విరహం చాలా విచిత్రమైనది. బాహ్యదృష్టికి అది లౌకికంగా కనిపిస్తుంది. కాని తాత్త్వికంగా చూస్తే అది ఆధ్యాత్మికమైన విరహతాపం. ఇలాంటి వేదనను కబీరు, జాయసీలాంటి కవులు కూడా వివరించారు. కాని మీరా నోట అది సహజరమణీయంగా పలుకుతుంది.

# 5

మైఁ బిరహిణి బైఠీ జాగూఁ, జగత్ సబ్ సోవైరీ ఆలీ |
బిరహణి బైఠీ రంగమహల్ మేఁ, మోతియన్ కీ లడ్ పోవై |
ఇక్ బిరహణి హమ్ ఐసీ దేఖీ, అసువన్ కీ మాలా పోవై |
తారా గిణ్ గిణ్ రైణ్ బిహానీ, సుఖ్ కీ ఘడీ కబ్ ఆవై |
మీరా కే ప్రభు గిరిధర్ నాగర్, మిల్ కే బిఛడ్ న జావై ||

* * *

ప్రపంచమంతా నిశ్చింతగా నిద్రపోతున్నది. కాని విరహవేదనతో బాధపడుతున్న ప్రియురాలు జాగరణ చేస్తూఉన్నది. ఈ విరహం కూడా రెండురకాలు. ఒక విరహిణి రాజభవనం (రంగమహలు) లో కూర్చుని ముత్యాలదండ అల్లుతున్నది — మరో విరహిణి కన్నీటిబిందువులతో కంఠహారం తయారుచేసుకొంటున్నది. రాజభవనంలో కాలక్షేపం చేస్తున్న విరహాంగనభర్త తాత్కాలికంగా ఏ దూరదేశమో వెళ్ళాడు. కొన్నాళ్ళకు రాగలడనే ధైర్యం ఉంది. తొలిసారి ప్రియుని కలిసిన మధురక్షణాలు ఇంకా స్మృతిపథాన్ని దాటిపోలేదు. కాని ఆరుబయట ఆకాశం క్రింద చుక్కలను లెక్కపెడుతూ సుదీర్ఘమైన విరహంతో

బాధపడుతున్న విరహిణికి కన్నీటిబొట్లు తప్ప మరేమీ లభించేట్లు కని పించటంలేదు. మొదటిది లౌకికమైన ప్రేమ. రెండవది పారలౌకికమైన ప్రేమ, రెండింటికీ లక్ష్యం ఆనందమే. కాని, ఒకటి తాత్కాలికమైన ఆనందం. మరొకటి శాశ్వతమైన ఆనందం. తన బాధలన్నీ తొలగి ప్రియుని సమాగమంతో ఆనందంగా కాలక్షేపం చేసేందుకు మంచి గడియలు ఎప్పుడు వస్తాయా అని విరహిణి మీరా వాపోతూ ఉన్నది. ఒకసారి కలుసుకున్న ప్రేయసీప్రియులకు ఎడబాటంటూ ఉండగూడదని ఆమె అభిప్రాయం. అసలే కలుసుకోని ప్రేయసీప్రియులకు ఎడబాటు క్రొత్తవిషయం కాదు. కాని కొన్నాళ్ళు కలిసి మెలిసి కులాసాగా కాల క్షేపం చేసిన తర్వాత విరహంలో ఏవేవో సన్నివేశాలు గుర్తుకు వస్తాయి. గుర్తుకువచ్చినప్పుడల్లా బాధ కలుగుతుంది. ఆధ్యాత్మిక విరహంలో ఇలాంటి బాధ హెచ్చుగా ఉంటుంది. కాని తాను పరమాత్మనుంచి విడిపోయిన జీవినని తెలిసినప్పుడే యీ విరహతాపం తీవ్రంగా బాధిస్తుంది. అవి గుర్తురాకుంటే ఏ బాధాలేదు. అందువల్లనే ప్రపంచమంతా హాయిగా నిద్రించే సమయంలో మీరా నోరు తెరచుకుని చుక్కలు లెక్కపెడుతూ ఆకాశంక్రింద జాగరణ చేస్తూఉంది.

"యా నిశా సర్వభూతానాం తస్యాం జాగర్తి సంయమీ|
యస్యాం జాగ్రతి భూతాని సా నిశా పశ్యతో మునేఃగదా."||

(గీత --2--69)

# 6

తూఁ నాగర్ నందకుమార్, తోసోఁ లాగ్యో నేహరా |
మురలీ తేరీ మన్ హర్యో బిసర్యోగ్రిహ జ్యోహోర్ |
జబ్ తే స్రవనని ధునిపరీ, గ్రిహ అంగనా నసుహోయి |
పారధి జ్యూఁచూఁకే నహీఁ, మ్రుగీవేధిదయి ఆయి |
పానీ పీర్ న జాణయీ, మీన్ తలఫి మరి జాయి |

రసిక్ మధుప్ కే మరమ్‌కో నహీఁ సముఝత్ కమల్ సుభాయి |
దీపక్ కోజుదయానహీఁ ఉడి ఉడి మరత పతంగ్ |
మీరా కేప్రభు గిరిధర్ మిలే, పాణీమిల్ గయే రంగ్ ||

* * *

ఎంతసేపు చెప్పుకున్నా చెప్పినమాట చెప్పకుండా మీరా తన కరుణగాథ చెప్పుకోవలసిందే కాని కన్నయ్య మనస్సు మాత్రం కరగటం లేదు. నందకుమారుడు మంచివాడు, మర్యాదగలవాడు, మధురంగా మాట్లాడే స్నేహశీలి అని మీరా అతణ్ణి ప్రేమించింది. మీరా మనస్సును గ్రహించి తన్ను మక్కువగా చేరదీస్తాడని ఆశించింది. కాని ఆమె ఆశలన్నీ అడియాసలయినాయి. మాటామంతీలేకుండా కన్నయ్య మిన్నకున్నాడు. ఆయన పిల్లనగ్రోవి రుచిమరగినప్పటి నుంచీ మీరా సర్వస్వం మరచి ఆ శబ్దాన్ని వెతుక్కుంటూ బయలుదేరింది. ఇల్లూవాకిలీ, పనీపాటా అన్నీ విడిచిపెట్టి వేణునాదాన్ని అన్వేషిస్తూ వెళ్ళింది. కాని దయాదాక్షిణ్యాలు లేని బోయవాడు జింకను వలలో వేసుకున్నట్లు మాయలాడు మాధవుడు మీరాను విరహబాధకు గురిచేశాడు. వేటగాని కది ఆట— కాని జింకకు ప్రాణసంకటం. నీటికి దూరమయిన చేప నీటికోసం పరితపిస్తుంది. కాని చేప పడే బాధ నీటికి ఏమాత్రం బోధపడదు గదా. నీటిమీాద చేపకున్న ప్రేమలో సహస్రాంశంకూడా నీటికి చేపమీాద ఉండదు. అలాగే కమలాన్ని చూచి భ్రమరం మురిసిపోతుంది. అంతులేని ఆనందంతో పువ్వుచుట్టూ పదే పదే తిరుగుతుంది, పాడుతుంది, ఆడుతుంది. కాని కమలానికి ఇదేమీాపట్టదు; అది పట్టించుకోదు. తుమ్మెదకు ఉన్న రసపిపాస కమలానికి ఉంటుందా? దీపకాంతి చూచి పురుగులు ఎగిరి గంతులువేసి క్షణంలో ఆ దీపజ్వాలలోపడి ప్రాణాలను సమర్పిస్తాయి. కాని వాటిలో ఉన్న ఆవేశం ఆవేదన దీపానికి ఎలా తెలుస్తుంది!

కాని మీరా సంగతికూడా అంతేనా? నీటిలో రంగు కలిసిపోయి నట్లు మీరా తన ప్రియునిలో లీనమై పోయింది.

# ఆత్మీయత

## 1

పియా అబ్ ఘర్ ఆజ్యోమేరే, తుమ్ మోరే హూఁతోరే |
మైఁ జన్ తేరా పంథ్ నిహారూఁ మారగ్ చితవత్ తోరే |
అవధ్ బదీతి అజహూఁ న ఆయే, దుతియన్ సూఁ నేహ్ జోరే |
మీరా కహే ప్రభు కబరేమిలోగే, దరసన్ బిన్ దిన్ టోరే ||

* * *

ఉదయం-- సాయంకాలం, నేడు -- రేపు, రేపు-- మాపు ఇలా ఎదురుచూచి చూచి చివరకు మీరా తన మనోహరుని బతిమాలు కుంటుంది. బెదిరించి లాభం లేదు. నిష్ఠూరంగా మాట్లాడినందువల్ల అంతకంటే ప్రయోజనం లేదు. కాబట్టి తియ్యని మాటలతోనే ప్రియుని రప్పించుకోవాలి.

'నీవు నా వాడివి, నేను నీ దానిని' అని మీరా తన అభ్య ర్థన నారంభిస్తుంది. నిజమే కదా ! 'మయి తే; తేషు చాప్యహం' (నేను నా భక్తుల్లో ఉంటాను. నా భక్తులు నాలో ఉంటారు) అని భగవంతుడు స్పష్టంగా చెప్పాడుకదా ! ఈ మాటను మూటగట్టు కుని మీరా ఇన్నాళ్ళు ఎదురుచూస్తూనే ఉన్నది. గడువు దాటింది. అయినా ప్రియుడు రాలేదు. ఎవరిచేతనన్నా ఏమయినా కబురుపంపుతా డేమోనని కూడా ఆమె దారినిపోయేవాళ్ళనందరినీ కొండంత ఆశతో

చూస్తూ ఉంది. ఇంతకూ పతి ఎప్పుడు వస్తాడో తనకే తెలియని అయోమయస్థితిలో ఉన్నది మీరా. ఇలా రోజులు గడుస్తున్నాయి. కాని యజమాని రాలేదని ఆమె ఆందోళన చెందుతూకూడా తన్ను తాను మందలించుకొని ప్రియునితో ఆప్యాయంగా తన ఆత్మీయతను ఇలా విన్నవించుకుంటున్నది :-

## 2

మ్హారే ఘర్ ఆజ్యోస్రీతమ్ ప్యారా తుమ్ బిన్ సబ్ జగ్ ఖారా !
తన్ మన్ ధన్ సబ్ భేంట్ కరూఁ, ఓ భజన్ కరూఁమైఁ ధారా |
తుమ్ గుణవంత్ బడే గుణసాగర్, మైఁ హూఁ జౌగణ్ హోరా |
మైఁ నిగుణీ గుణ్ ఏకా నాహీఁ తుఝ్ మే జీ గుణ్ సారా |
మీరా కహై ప్రభు కబహి మిలోగే, బిన్ దరసణ్ దుఖియారా!

* * *

"ఎలాగయినా సరే నాకు ప్రియతముడైన నాప్రియుడు నాయిం టికి రావాలి. ప్రియుడులేని యిల్లు ప్రేతభూమే గదా ! ప్రియుడు మాయింటికివస్తే చాలు. నేను నా సర్వస్వమూ ఆయన కర్పిస్తాను. నా అందచందాలూ, తెలివితేటలూ, సిరిసంపదలూ అన్నీ ఆయనకు స్వాధీనంచేసి అహర్నిశలూ ఆయన భజనే చేస్తాను." -- మీరా వరించి భజించే ప్రియతముడు సకల గుణ సంపన్నుడు. సద్గుణాలు సముద్రంలా అతనిలో ముద్రవేసుకుని ఉంటాయి. ఆరాధ్యుని గుణగణాలతో పోల్చు కుని చూస్తే మీరాబాయికి తనలో అణుమాత్రంకూడా గుణ సంపద ఉన్నట్టు తోచదు. 'నేను గుణరహితను. నాలో చెప్పకోదగిన గుణం ఒక్కటికూడా లేదు. నీలో లేని గుణమే లేదు' అని సవినయంగా మీరా తన ప్రభువుకు విన్నవించుకొంటుంది. అయినా మీరా ప్రభు వును చూచేందుకు ఆరాటపడుతుంది. కన్నయ్యను చూడని కన్నులు

కన్నులేకావని ఆమె అభిప్రాయం. తన దగ్గర ఏవిధమయిన సాధన సంపదా లేక పోయినా, ఉన్నదంతా కన్నయ్యకు అర్పించటమే ఆమెకు గల అర్హత. ఈ ధైర్యం తోనే ఆమె ప్రియుణ్ణి తన యింటికి రమ్మని పిలుస్తున్నది. ఆత్మీయత ఒక్కటే ఆమెకు ఆస్కారం!

అనన్యభక్తితో అరాధ్యుని సేవించేందుకు ఆరాధ్యుని గుణగణాలపట్ల సంపూర్ణమైన విశ్వాసం, గౌరవం అవసరం. ఆరాధ్యుని గొప్పతనాన్ని గుర్తించినట్లుగానే తన లఘుత్వాన్ని కూడా త్రికరణశుద్ధిగా గమనించాలి. ఈ రెండు లక్షణాలూ మీరాబాయిలో కనిపిస్తాయి. ఇలాగే 'రామసో బడోహై కౌన్ మోసో కౌన్ ఛోటో, రామసో ఖరో హై కౌన్ మోసో కౌన్ ఖోటో' (రాముని కంటె గొప్పవాడు లేడు, నాకంటె తక్కువ వాడు లేడు. రాముని కంటే ఉత్తముడు లేడు, నాకంటె అధముడు లేడు) అని తులసీదాసు కూడా అంటాడు. అదే విధంగా త్యాగయ్యలాంటి తపోధనుడు కూడా 'కట కట నా చరితము కర్ణకఠోరమయ్యా' అని తన రామయ్యతో ఏకాంతంగా చెప్పకున్నాడు. తనలోని అవగుణాలూ, లోపాలూ, అల్పత్వం తెలుసుకొని బిడియపడకుండా పదిమందికి చెప్ప గలగటం భక్తికి మొదటి సోపానం.

'మైఁ నిగుణీ గుణ ఏకా నాహీ' అనే వాక్యాన్ని ఆధారం చేసుకుని కొందరు మీరాబాయి నిర్గుణ పరబ్రహ్మను ఆరాధించినట్లు భావిస్తారు. కాని యిక్కడ సగుణ నిర్గుణ చర్చ ప్రధానం కాదు. గుణరాహిత్యమే మీరా చెప్పదలచుకొన్న విషయం. కబీరుఛాయలు మీరాలో. కొన్ని కనిపించినా ఆమెది ముఖ్యంగా మధురభక్తి !

## 3

మనే చాకర్ రాఖో జీ, మనే చాకర్ రాఖో జీ |

చాకర్ రహ సూఁ బాగ్ లగాసూఁ నిత్ ఉఠ్ దరసణ్ పాసూఁ |

బృందావన్ కీ కుంజ గలిన్ మేఁ తేరీ లీలా గాసూఁ |
చాకర్ మేఁ దరసణ్ పావూఁ సుమిరణ్ పావూఁ ఖర్చి |
భావ భగతి జాగీరీ పావూఁ తీనోఁ బాతాఁ సర్ సీ |
మోర్ ముకుట్ పీతాంబర్ సోహై గల్ బైజంతి మాలా |
బృందావన్ మేఁ ధేను చరావై, మోహన్ మురలీ వాలా |
హరే హరే నిత్ బన్న బనావూఁ బిచ్ బిచ్ రాఖూఁ క్యారీ |
సావరియా కే దరసణ్ పావూఁ పహర్ కుసుంభీ సారీ |
జోగీ ఆయా జోగ్ కరణ్కూ, తప్ కరణే సన్న్యాసీ |
హరీ భజన్ కూ సాధూ ఆయా బృందావన్ కే బాసీ |
మీరా కే ప్రభు గహిర్ గంభీరా, సదా రహో జీ ధీరా |
ఆధీ రాత్ ప్రభు దరసణ్ దైహైఁ ప్రేమనదీ కే తీరా ||

* * *

ఏ రూపంలోనయినా సరే ప్రభుసాన్నిధ్యమే మీరాకు కావలసింది. భార్యగా, ప్రియురాలిగా తనను స్వీకరించక పోయినా పనిమనిషిగా తీసుకున్నా చాలునని ఆమె తన ప్రభువును ప్రార్థిస్తుంది.

ప్రభూ ! నన్ను పనిమనిషిగా నీ కొలువులో చేర్చుకోవాలు. అదే నాకు పదివేలు. ఏ పని చెప్తే ఆ పని చేస్తాను. ఇంటిపనంతా చేస్తాను. అదే కాదు, తోటపని కూడా చేస్తాను. మంచి తోట పెంచుతాను. రోజూ ఉదయం నీవు తోట చూచేందుకు వచ్చినప్పుడు కన్నులపండువుగా నిన్ను నేను చూడగలుగుతాను. బృందావనంలో ప్రతి సందులో గొందిలో వీథిలో ఇంటిలో పొదరింటిలో నీ సంకీర్తన చేస్తాను. నీ లీలలను పాడి వినిపిస్తాను. ఈ పని చేసినందుకు నాకు జీతం బత్తెం కూడా ఎక్కువ ఇయ్యనక్కరలేదు. నీ దర్శనభాగ్యమే నాకు నెల జీతం. నిన్ను స్మరించటమే నాకు పైఖర్చు. నీమీది అనురాగం, నీయందు భక్తి, నాపయి నీ అనుగ్రహం ఇవే నాకు

బహుమతులూ, బోనసులూ, జాగీరులూ. ఈ సేవకు నాకీ ప్రతిఫలం చాలు !

తలమీద నెమలిపింఛం కిరీటంలా శోభిస్తూ మెడలో వైజయంతీ మాల వేయి వెన్నెలలు వెలయిస్తూ మా పీతాంబరధారిని అలంకరిస్తూ ఉంటే ఆయన పిల్లనగ్రోవి మ్రోగిస్తూ ఆవులను మేపుతూ బృందావన పుణ్యభూమిలో విహరిస్తూ ఉంటే కన్నులారా చూచే అదృష్టం నాకు లభిస్తుంది.

నాతోటలో రోజుకొక మొక్క వేసి రంగురంగుల పూలు పూయిస్తాను. మధ్య మధ్య మంచి మంచి కాయలు కాయిస్తాను. పండ్లు పండిస్తాను. నా తోట చూచేందుకు మా నల్లనయ్య వస్తే ఆయన చల్లనిచూపులు ఎల్లవేళలా కన్నులపండువుగా నన్ను పరవశం చేస్తాయి.

కన్నయ్య ఉన్న చోటుకు రకరకాల వాళ్ళు చేరుతారు. యోగాభ్యాసం చేసే యోగులూ, తపస్సు చేసే సన్న్యాసులూ, భజన చేసే సాధువులూ — అందరూ బృందావనం చేరుకొంటారు. వాళ్ళందరితో హాయిగా కాలక్షేపం చెయ్యవచ్చు.

మీరాప్రభువు సామాన్యులకు బోధపడేవాడు కాదు. చాల గంభీరమైన స్వభావం ఆయనది. యమునా తీరంలో అర్ధరాత్రివేళ దర్శనమిస్తాడు. ఓపికగా మక్కువతో మాధవసందర్శనంకోసం వేచి ఉండాలి. ఎవరు ఏ రూపంలో ఆయన్ని సేవిస్తే వాళ్ళకు ఆ రూపంలోనే ఆయన సాక్షాత్కరిస్తాడు. బృందావనం ప్రేమవనం. యమునాతీరం ప్రేమనదీ తీరం. మురళీధరుడు సంచరించిన పుణ్యభూమి. సారవంతమైన సారస్వతసుక్షేత్రం. అక్కడ ఏ పంటయినా పండుతుంది. ఏ పువ్వయినా పూస్తుంది. ఏ మొక్కయినా మొలుస్తుంది. కాని పంటపండించేందుకు

పండులాంటి నిండుమనస్సు కావాలి. ఆ మనస్సులో అహంకారానికీ, అభిమానానికీ తావుండకూడదు.

ఎంత మధురమైన భావన మీరా నోట ఈ పాటలో వెలువడిందో, అది సహృదయులకు మాత్రమే బోధపడుతుంది. మామూలుగా మాట్లాడుకొనే మాటల్లో మధుర గంభీరమైన భావాన్ని విశదీకరించటం మీరాకు సహజంగా సంక్రమించిన సారస్వతసంపద !

# 4

అబ్ మైఁ సరణ్ తిహారీజీ, మోహిఁ రాఖోకృపానిధాన్ |
అజామీల్ అపరాధీ తారే, తారే నీచ్ సదాన్ |
జల్ డూబత్ గజరాజ్ ఉబారే, గణికా చఢీ విమాన్ |
ఔర్ అధమ్ తారే బహుతేరే, భాఖత్ సంత్ సుజాన్ |
కుబజా నీచ్ భీలణీతారీ, జానై సకల జహాన్ |
కుహఁ లగికహేఁ గిణత నహి ఆవై, థకి రహై వేదపురాన్ |
మీరా కహై మై సరణ్ రావలీ సునియో దోనోఁకాన్ |

* * *

తన విన్నపం కన్నయ్య చెవిలో పడుతున్నదో లేదో అని మీరాకు అనుమానం వేసింది. ఒక చెవిలో ప్రవేశించి మరో చెవిగుండా వెళ్ళిపోవచ్చునని రెండు చెవులతో వినమని అంటున్నది మీరా. ఎంత చనవు ! ఎంత చాతుర్యం! ఎంతటి వాగ్వైదగ్ధత! 'సునియో దోనోం కాన్' అని ఎంతమంది అనగలరు?

"అన్యథా శరణం నాస్తి త్వమేవ శరణం మమ"అన్నట్లుగా మీరా ప్రభువుతో విన్నవించుకుంటున్నది :

"నేను నిన్ను ఆశ్రయించాను. నన్ను నీవు రక్షించి తీరాలి. ఇంత కుముందు నీవు నాలాంటివాళ్ళను చాలామందిని రక్షించావని విన్నాను. జీవితమంతా ఎలా గడిచినా చివరి సమయంలో తన పిల్లవాణ్ణి పిలుస్తూ 'నారాయణా' అన్నంత మాత్రాన పాపిష్టి అయిన అజామిళుడు కైవల్యం పొందాడు. మాంసం అమ్ముకొని బ్రతికే సదాన్ ఇంటిలో సాలగ్రామ రూపంలో ప్రవేశించి నీవు అతనికి ఆత్మసాయుజ్యం ప్రసాదించావు. మొసలిబారినుంచి గజరాజును రక్షించావు. రామచిలుకకు ప్రేమతో రామనామం బోధించిన వేశ్యను నీలో చేర్చుకున్నావు. గూనితో బాధపడే కుబ్జకు ఆలింగనసౌఖ్యం ప్రసాదించి ఆమెను అపూర్వ సుందరిగా రూపొందించావు. ఇంకా ఎంతమంది పతితులనో నీవు చేరదీసి కాపాడావు. సాధువులు, మహాత్ములు నిన్ను పతితపావనుడవని కొనియాడుతారు. శబరి నీ దర్శనంకోసం జీవితమంతా ధారపోసి చివరకు నీ దర్శనభాగ్యంతో తరించిపోయింది. శ్రుతులు, స్మృతులు, పురాణాలు నీవు చేసిన మహాకార్యాలను వెయ్యినోళ్ళతో ఘోషిస్తూ ఉన్నాయి. ఇంత దయామయుడవు నన్నెందుకు ఉపేక్షిస్తున్నావో నాకు తెలియటం లేదు. బహుశః నా మొర నీకు వినిపించటంలేదేమో! కొంచెం జాగ్రత్తగా రెండు చెవులతో విను.

# 5

తుమ్ సుణో దయాల్ మ్హారీ అర్జీ
భవ సాగర్ మేఁ బహీ జాతహూఁ కాఢోతో థారీ మర్జీ |
యా సంసార్ సగో నహి కోయీ సాంచా సగా రఘువర్‌జీ |
మాత పితా ఔ కుటుమ్ కబీలో, సబ్ మతలబ్ కే గర్‌జీ |
మీరా కే ప్రభు అర్జీ సుణ్‌లో, చరణ్‌ల గావో థారీ మర్జీ||

* * *

ఇది మీరా తన ప్రభువుకు పంపుకున్న అర్జీ (ప్రార్థనా పత్రం). సంసారసముద్రంలో మునిగిపోతూ మరోమార్గం లేక మాధవుని వేడు కొంటున్న యీ మీరా గీతం తులసీదాసు వినయపత్రికలోని గీతాలను పోలి ఉంటుంది. ఆపద్బాంధవుడని హరికి పేరు కనుక తనను మహాప దనుండి కాపాడుమని ఆమె తన ప్రభువును వేడుకుంటుంది.

"దయామయా! నా మొరవిని నన్ను కాపాడు. సంసార సము ద్రంలో నేను మునిగిపోతున్నాను. నీవు తలుచుకుంటే చాలు నన్ను ఉద్ధరించగలవు. ఈ ప్రపంచంలో నాకు ఆత్మీయులు మరెవ్వరూ లేరు. నిజమైన బంధువు రఘునాథుడవైన నీవే. తల్లీ, తండ్రీ, అన్నదమ్ములూ, అక్క చెల్లెళ్ళూ, మిగిలిన చుట్టాలూ వాళ్ళ వాళ్ళ స్వార్థాన్ని చూచు కుంటారే కాని నా మీద నిజమైన ప్రేమ, అచ్ఛమైన అనురాగం, వాంఛ లేని వాత్సల్యం వారిలో ఎవ్వరికీ లేదు. అందువల్లనే వాళ్ళనం దరినీ వదలి నీ చరణసన్నిధిని చేరుకున్నాను. నన్ను ముంచినా తేల్చినా నీదే భారం. నాకు నీ పాదసేవ ప్రసాదించు అంతా నీ దయ !"

జీవితంలో తనవారనుకున్న బంధువులంతా తనకు తలపెట్టిన ద్రోహాన్ని మనసులో పెట్టుకుని మీరాబాయి ఈ మాట అనిఉం డవచ్చు. రాజకుటుంబంలో జన్మించినా ఆమె జీవితం నానాబాధలతో విషాదమయమయిపోయింది. ఈ విధంగా ఏర్పడిన విరక్తి ఆమెలో పరమార్థచింతనమీద ఆసక్తిని పెంపొందించింది. జీవితం సుఖంగా జరిగినా ఆ సుఖం క్షణభంగురమైనదే. శాశ్వతమైన సుఖం ఆద్యంత వంతము లయిన లౌకిక సాధనసంపదలవల్ల లభించదు. ఆ దృష్టితో చూస్తే చుట్టాలూ పక్కాలూ ఎవరి స్వార్థం వాళ్ళు చూచుకొనేవాళ్ళే కాని ఆత్మసాక్షాత్కారానికి వారి సహకారం ఏమీఉండదు. అధ్యాత్మిక సాధనలో ఎవరికివారే తరణోపాయం చూచుకోవాలి. 'ఉద్ధరే దాత్మ నాత్మానం' అని గీత గీచిన గీటు అక్షరాలా నిజం. శిలాక్షరమే అది !

"మాతా నాస్తి పితా నాస్తి నాస్తి బంధుస్సహోదరః, అర్థం నాస్తి గృహం నాస్తి తస్మాత్ జాగ్రత జాగ్రత" అన్న హెచ్చరిక కూడా మీరాబాయి పూర్తిగా గమనించినట్లు ఈ పాటలో తెలుస్తుంది.

"ఆత్మనః కామాయ సర్వం ప్రియం భవతి' అని ఉపనిషత్సూక్తి. ఎవరికీ, ఎవరిమీదా నిజమైన అనురాగం లేదు. ఆత్మానురాగమే బాహ్యవిషయానురాగంగా పరిణమిస్తుంది. ఉత్తమకోటికి చెందిన అనురాగంలో స్వార్థం లేశ మాత్రం కూడా ఉండదు. అలాంటి పరమప్రేమనే నారదుడు భక్తి అని వర్ణించాడు. గోపికల ప్రేమ అలాంటిది. శ్రీకృష్ణుడంటే వాళ్ళు సర్వస్వం మరిచి అతనివెంట పరుగెత్తుతారు. ఎందుకో వాళ్ళకే తెలియదు. ఇనుము సూదంటురాయికి అంటుకొన్నట్లు గోపికలు శ్యామసుందరాంగుని మీద ఆసక్తలయినారు. ఇది నిస్వార్థమైన నిర్మలప్రేమ. మీరాలోని మాధుర్యభావం కూడా ఇలాంటిదే.

## 6

కోయీ కహియౌరే ప్రభు ఆవన్ కీ ఆవన్ కీ మన్ భావన్ కీ |
ఆప్ న ఆవై లిఖ్ నహీ భేజై, బాణ్ పడీ లలచావన్ కీ |
ఏ దోయి నైణ్ కహ్యో నహీఁమానై, నదియా బహైజైసే సావన్‌కీ |
కహా కరూఁ కఛు నహీఁ బస్ మేరో, పాంఖ్ నహీఁ ఉడిజావన్ కీ
మీరా కహై ప్రభు కబరి మిలోగే, చేరీ భయి హూఁ తేరే దావన్ కీ ||

* * *

ప్రభువు రాకకోసం ఎదురు చూడగా చూడగా చివరకు మనోహరుడు కొన్ని క్షణాల్లోనే రావచ్చుననే సూచనలు కనిపించాయి. దానితో ఉత్కంఠ మరీ పెరిగింది. ఆశ లేకుంటే కుతూహలమే లేదు. ఆరాధ్యుని అడుగుజాడలు పొడచూపే సరికి మీరా ఉక్కిరి బిక్కిరి

అయిపోయింది. వస్తాడు వస్తాడను కొంటూ ఉంటే చివరకు వస్తాడో రాడో? తాను రాకుండా ఎవరిచేతనైనా తన క్షేమసమాచారాలు వ్రాసి పంపుతాడేమో? ఫలానా రోజుకు వస్తానని వాయిదా వేస్తాడేమో? లేక ఉత్తరప్రత్యుత్తరా లెందుకులే అని నిజంగా రానే వస్తాడో? ఇలా మీరా ఆరాటపడుతూ పరిపరివిధాల భావనా ప్రపంచంలో విహరిస్తూ ఉంది. ఎంత వారించినా ఆమె కనుదోయికి స్థాయి చిక్కటం లేదు. శ్రావణమాసంలో మేఘాలు కురిసినట్లుగా ఆమె నేత్రాలు అశ్రుధారలను ప్రవహింపజేస్తున్నాయి. వస్తాడన్న ఆనందం, రాడేమోనన్న ఆందోళనా రెండూ ఆ అశ్రుధారలకు దోహదమిస్తున్నాయి. ప్రేమాతి రేకం వల్ల నయనాలు కన్నీటికెరటాలుగా పొంగిపొరలి పోతున్నాయి. కాని పాపం మీరా ఏమి చెయ్యగలదు? ప్రియుడున్న చోటికి వెళ్ళి వెంటనే ఆయన పరిస్థితి చూద్దామని మనస్సు ఉఊత లూగుతూ ఉంది. కాని ఎలా వెళ్ళటం? ఎగిరి గంతులేసి వాలేందుకు రెక్కలు కూడా లేవాయె ! ప్రియుడు తనంతటతాను వచ్చేవరకు వేచిఉండ వలసిందే కాని మరోమార్గం లేదు. ఈ మీరా వాని దాసి. ప్రభువు చెప్పాచేతల్లో మెలగవలసిందే. ఎలా ఆడిస్తే అలా ఆడవలసిందే అని విధిలేక మీరా తన మనస్సును సమాధానపెట్టుకుంది.

ఇంతకూ ప్రియుడు వస్తున్నాడని జోస్యం చెప్పిన మేధావి ఎవరో? అది మీరాకే తెలుసు. ఆమె అంతరంగమే ఆమెకు ఈ అంతర్యం చెప్పి ఉండాలి. నిర్మలమైన మనస్సుకు రానున్న మంచి తన రాకను ముందే తెలియపరుస్తుంది కాబోలు! ఇలాంటి సందిగ్ధావస్థలో నున్న సాధువులకు అంతఃకరణమే వస్తుస్థితిని విశదపరుస్తుంది. కాబట్టి మీరా అనుకున్నది అయితీరుతుంది. "సతాం హి సందేహపదేషు వస్తుషు ప్రమాణ మంతఃకరణప్రవృత్తయః" అని కదా కవికుల గురుని సూక్తి!

# 7

సునీహో మైం హరి ఆవన్ కీ ఆవాజ్

మ్హైల్ చఢీ చఢిజోవూం మేరీ సజనీ, అబ్ ఆవై మహరాజ్ |

దాదర్ మోర్ పపైయా బోలే కోయిల్ మధురే సాజో |

ఉమంగ్యో ఇంద్ర చహూం దిసి బరసై, దామణి ఛోడీలాజ్ |

ధరతీ రూప్ నవా నవా ధరియా. ఇంద్రమిలణ్ కే కాజ్ |

మీరాకేప్రభు హరి అవినాసీ, వేగ్ మిలో మహరాజ్ ||

* * *

అంతరంగపతి హరి వస్తున్నట్లు ఆయన అడుగుల చప్పుడు చెప్తూ ఉంది. వీనులవిందుగా హరిచరణధ్వని వినిపిస్తూ ఉంటే మీరా హృదయం ఆనందంతో పొంగిపోతూ ఉన్నది. ఇంకా ప్రియుని రూపం కనిపించటం లేదు. కాని అడుగులసవ్వడి వినిపిస్తూ ఉంది. నలుమూలలా హరి వస్తున్నాడనే ఆనందం స్పందిస్తూ ఉంది. పట్టలేనిఉత్సాహంతో మీరా తన చెలికత్తెలతో కూడి రాజభవనం పైఅంతస్తు మీదికి వెళ్ళి చూస్తున్నది. అదుగో వస్తున్నాడు--ఇదుగో వస్తున్నాడు. అని తన నాథుని రాకకోసం క్షణమొక యుగంగా ప్రేయసి ఎదురుచూస్తున్నది. ఎదురుచూస్తున్న మీరాకు ప్రోత్సాహం ఇచ్చేందుకు పరిసరాలు కూడా సహకరిస్తూ ఉన్నాయి. కప్పలు బెకబెకలాడుతున్నాయి. నెమలి పింఛం విప్పి నాట్యం చేస్తూ ఉంది. చాతకపక్షి స్నేహగీతికలు పాడి ప్రేయసీప్రియులకు వాక్సహాయం చేస్తున్నది. కోకిలమ్మ పంచమస్వరంతో మధురగీతాలు పాడుతున్నది. ఇంద్రుడు మహానందంతో పొంగిపోయి మేఘరూపంలో వర్షిస్తున్నాడు. ఎటుచూచినా జోరున వానకురుస్తూ ఉంది. మధ్య మధ్య మేఘాల్లోనుంచి సౌదామిని తొంగిచూస్తున్నది. అప్పుడప్పుడు తెంపుచేసి బిడియం లేకుండా విద్యుల్లత [illegible] ఉంది. కళ్ళు మిరుమిట్లు కొలిపే లాగా మబ్బులు చీల్చుకొని మెరుపులు తరుముకొని వస్తున్నాయి. ఇంద్రుడు భూలోకానికి దిగివస్తున్నాడనే సంబ

రంతో ధరిత్రి నానా వేషాలూ ధరించి క్రొత్తవెలుగులు ప్రదర్శిస్తూ ఉంది. భూమ్యాకాశాలు ప్రేమాలింగనం చేసుకునే యీ మధురాతిమధుర సమయంలో మీరా ఒక్కక్షణం కూడా ప్రియవిరహం సహించలేని స్థితిలో ఉంది. త్వరగా వచ్చి తనను చేపట్టవలసిందని మీరా తన ప్రభువును వేడుకుంటున్నది మీరా కోరిక త్వరలోనే నెరవేరుతుందని ప్రకృతి సూచిస్తున్నట్లు తోస్తున్నది.

ప్రియుని రాకను సూచించే ప్రకృతి లక్షణాలను మీరాబాయి ఎంత విలక్షణంగా కళ్ళకు కట్టినట్లు ఈ పాటలో వర్ణించిందో రసజ్ఞులు గ్రహించగలరు. రాజభవనం పైఅంతస్తుకు చేరి ప్రియుని రాకకోసం ఎదురుచూడటంలో లౌకికప్రేమలో ఉన్న లాలిత్యమే కాక ఆధ్యాత్మిక రాగానుబంధంలో ఉన్న గాంభీర్యం కూడా చాలా కళాత్మకంగా కనిపిస్తుంది. మేడ మీద నుంచి దూరంగా వస్తున్న ప్రియుణ్ణి చూడటం లోక సహజం. దైవం మానవులకు నిర్మించి యిచ్చిన దేహాలయం మీద అత్యున్నతస్థాయిలో ఉన్న సహస్రారచక్రంలో నుంచి సహస్ర పరమ రమణీయతను సాక్షాత్కరించుకోవటం ఆధ్యాత్మిక సాధనకు పరమావధి. ఐహికంగానూ, ఆముష్మికంగానూ ప్రేమకు అవధులను నిర్వచించి ప్రవచించే యీ మధురగీతం మీరామాధురికి మచ్చుతునుక.

దివికీ భువికీ గల సనాతన రాగానుబంధాన్ని మీరా మ్మాటలో వింటుంటే 'పృథివీ పూర్వరూపం, ద్యౌరుత్త రూపం, ఆకాశః--సంధిః, వాయుః సంధానం' అని నిర్వచించే ఉపనిషన్మహాసంహిత సందేశం గోచరిస్తుంది. వేదమంత్రాలలోని భావగాంభీర్యాన్ని మీరా తన మృదుమధుర శైలిలో మామూలు మాటల్లో తేల్చిచెప్తున్నట్లు అనిపిస్తుంది ఇలాంటి పాటలు వింటుంటే.

# ఆనందం

## 1

ఆవత్ మేరీ గలియన్‌మేఁ గిరిధారీ
మైఁతో ఛుప్‌గయీా లాజ్‌కీ మారీ |
కుసుమల్ పాగ్ కేసరియా జామా, ఊపర్‌ఫూల్ హజారీ |
ముకుట్ ఉపర్ ఛత్రబిరాజే, కుండల్ కీ ఛబి న్యారీ |
కేసరీ చీర్ దర్యాయీకోలేంగో, ఊపర్ అంగియా భారీ |
ఆవత్ దేఖి కిసన్ మురారీ, ఛిప్‌గయీా రాధాప్యారీ |
మోర్ ముకుట్ మనోహర్ సోహై, నథ్‌నీకీ ఛబి న్యారీ |
గల్‌మోతిన్ కీ మాల్ బిరాజే, చరణ్‌కమల్ బలిహారీ |
ఊభీరాధా అరజ్ కరత్‌హై, సుణజే కిసన్ మురారీ |
మీరాకే ప్రభు గిరిధర్ నాగర్, చరణకమల్ పర్‌వారీ ||

* * *

చివరకు శ్రీహరి ప్రియురాలి వీథికి వచ్చాడు. కాని సిగ్గుతో ప్రియురాలు దాక్కుంది. ఎదుటపడేందుకు ధైర్యం చాలలేదు. చాటుగా నిలబడి నల్లనయ్య అందచందాలను మెల్లగా పరిశీలిస్తున్న మీరాకు రాధామాధవులు యుగపద్దర్శనం ప్రసాదించారు. ఇద్దరిలో ఎవరు మాధవుడు, ఎవరు రాధ అని గుర్తుపట్టేందుకు వీలుకావటంలేదు. ఎఱ్ఱని తలపాగ, పచ్చని పంచె, మెడలో వేలకొలది పూలతో కట్టిన దండ, తలమీద కిరీటం, కిరీటం మీాద ఛత్రం, చెవులకు మకర కుండలాలు-- ఇవి మాధవుని మధురాకృతిని నిరూపిస్తున్నాయి. అలాగే పసుపుపచ్చని చీరె, పట్టు పావడా, కళ్ళకింపయిన కంచుకం రాధమ్మ రూపురేఖలను తీర్చిదిద్దుతున్నట్లు కనిపిస్తున్నాయి. కృష్ణయ్య వస్తున్నట్లు చూచి రాధ చాటుకు వెళ్ళింది. అందాలరాశిని అలంకరించిన నెమలి

కిరీటం ముక్కుపుడకను మురిపిస్తూ మెరిపిస్తూ మరిపిస్తూ ఉంది. ఆమె మెడలోని ముత్యాలహారం తన మనోహరుని చరణసన్నిధిని ఆశ్రయించి ఆరాధిస్తున్నట్లు తోస్తున్నది. చివరకు రాధమ్మ కృష్ణయ్య ఎదుటికి వచ్చి తన ఎదలోని మధురవేదనను వినయంతో విన్నవించుకుంది. మీరా కూడా రాధను చూచి ధైర్యం తెచ్చుకొని తన గిరిధరుని చరణ సన్నిధిలో చేరిపోయింది.

రాధామాధవులు మీరామాధవులుగా రూపొందారు. శ్రీహరిని అనన్యభావనతో ఆరాధించిన మీరాబాయి కేవలం మాధవునితోనే కాక రాధామాధవయుగళితో తాదాత్మ్యం చెందింది.

లౌకికమైన అనురాగంలో ప్రేయసి తన ప్రియతముని ఏకాంతం కోరుతుంది. మరొకరి ప్రేమకు తన ప్రియతముని హృదయంలో స్థాన ముండకూడదు. అలా విభక్తమయిన ప్రేమ ప్రియురాలు సహించదు. కాని అలౌకికమైన ఆధ్యాత్మిక ప్రేమలో ప్రేయసి చాలా ఉదారంగా ప్రియుని అరాధిస్తుంది. తన ఆరాధ్యుని ప్రేమకు ఎంతమంది ఆరాధి కలైనా పాత్రులు కావచ్చు. విషయవాసనలకు దూరమైన భావయోగం ఇలాంటి ప్రేమలో ప్రధానం. ఈ దృష్టితో మాధవుణ్ణి ఆరాధించిన మీరాబాయికి ప్రపంచమంతా స్త్రీమయంగానే తోస్తుంది. మహీ తలంలో మాధవు డొక్కడే మగవాడు; మిగిలినవాళ్ళందరూ మగువలే. ఆరాధ్యు డొక్కడే. (ఆ) రాధికలంతటా ఉండవచ్చు. ఎందరయినా ఉండవచ్చు. ప్రపంచంలో కనిపించే ప్రేమసంబంధా లన్నింటిలో భార్యా భర్తల మధ్య ఉండే ప్రేమ మధురాతిమధురమైనది. ఇంతకంటె మధు రమైనది రాధామాధవుల అనుబంధం. ప్రాపంచికసౌందర్యం క్షణభం గురం. పరమాత్మసౌందర్యం శాశ్వతం, అనంతం, ఆనందసంధాయకం. అనంతసౌందర్యం, అఖండమాధుర్యం, అనిర్వచనీయానందం ఆధ్యాత్మిక ప్రేమకు లక్ష్యాలు. ఇదే మీరాబాయి సాధించిన మధురభక్తి!

## 2

జోసీ జానే లాఖ్ బధాయిారే, అబ్ ఘర్ ఆయే శ్యామ్ |
ఆజ్ ఆనంద్ ఉమంగి భయోహై, జీవలహై సుఖధామ్ |
పాంచ్ సఖీ మిలి పీవ్ పరసికై, ఆనంద్ ఠాముఁ ఠామ్ |
బిసరి గయిా దుఖ్ నిరఖి పియాకూ సుఫల్ మనోరథ్‌కామ్ |
మీరా కే సుఖ్‌సాగర్ స్వామీ భవన్ గవన్ కియో రామ్ ||

* * *

జ్యోతిష్కుడు చెప్పినమాట నిజమయింది. శ్యామసుందరాంగుడు మీరా యింటికి వచ్చాడు. ఈ మాట చెప్పిన జోస్యులకు కృతజ్ఞత చెప్పకోవాలి. ప్రియుడు ఇంటికి వస్తే ఇంటికి ఎక్కడలేనికాంతి వచ్చినట్టయింది. అంతులేని ఆనందం పొంగిపొరలి వస్తూఉంటే ఇల్లు సుఖసంపదలకు ఆటపట్టయింది. మనస్సు కుదుటపడింది. ప్రాణాలు లేచి వచ్చాయి. జీవితంలో నూతనచైతన్యం ప్రవేశించింది. ప్రియుడు తన యింటికి వచ్చాడని తెలియగానే అయిదుగురు చెలికత్తెలు వచ్చి అతని చుట్టూ చేరారు. అతని స్పర్శ పోకగానే వాళ్ళకు ఎక్కడలేని సంతోషమూ వచ్చింది. ఆనందంతో ఉప్పొంగిపోయినారు. ప్రియుణ్ణి చూచినంతనే వాళ్ళ దుఃఖం అంతరించిపోయింది; వేదన శాంతించింది; కోరిక తీరింది; తపస్సు ఫలించింది. మీరా దర్శించిన ఆరాధ్యదైవం సకల సుఖసంపదలకూ సముద్రంలాంటి నిలయం. అలాంటి ప్రభువు ఇంటికివస్తే ఇక కావలసిందేముంది? కామధేనువు లభించినట్లే గదా !

ప్రియుని రాకకు ఉప్పొంగిపోయి అతని అంగాంగస్పర్శను అనుభవించిన చెలికత్తెలు ఎవరో అన్న జిజ్ఞాస కలగటం సహజం. శబ్ద స్పర్శరూప రసగంధాలకు ఆశ్రయమిచ్చే పంచజ్ఞానేంద్రియములే యీ చెలికత్తెలు. లౌకికమైన ఇంద్రియానుభూతి శాశ్వతసౌఖ్యం ప్రసాదించ

లేదు. పారలౌకికమైన పరమాత్మానుభూతి ఇంద్రియాతీతమైన శాశ్వత సుఖశాంతులను అనుగ్రహించగలదు. ఇదే మీరా కోరిన ఆనందనిలయం!

# 3

హోరీ ఖేలత్ హైఁ గిరిధారీ,
మురలీ చంగ్ బజత్ డఫ్ న్యారో, సంగ్ జుబతి వ్రజనారీ |
చందన్ కేసర్ ఛిరకత్ మోహన్, అపనేహాథ్ బిహారీ |
భరి భరి మూఠి గులాల్ లాల్ చహుఁ దోత్ సబన్ పై డారీ |
ఛైల్ ఛబీలే నవల్ కాన్హసంగ్, స్యామా ప్రాణ్ పియారీ |
గావత్ చార్ ధమార్ రాగ్ తహ, దై దై కల్ కరతారీ |
ఫాగ్ జు ఖేలత్ రసిక్ సాఁవరో, బాఢ్యోరస్ బ్రజ్ భారీ |
మీరాకే ప్రభు గిరిధర్ సాగర్ మోహన్ లాల్ బిహారీ ||

* * *

ఉత్తరదేశంలో, ముఖ్యంగా మధుర, గోకులం, బృందావనంలో హోలీపండుగ చాలా వేడుకగా జరుపుకుంటారు. ప్రేమకూ, ఆనందానికీ ఈపండుగ పెట్టినపేరు. ఫాల్గుణ పూర్ణిమనాడు ఈ పండుగ వస్తుంది. పూర్ణిమనాటి రాత్రి హోలీమంటలు పెట్టి హోలికాదహనం చేస్తారు. మరునాడు ఉదయం నుంచీ మధ్యాహ్నం వరకూ రకరకాల రంగులతో కలిపిన నీళ్ళను గొట్టాలలో నింపి ఒకరిమీాద ఒకరు చల్లుకుంటారు. ముఖ్యంగా వరుస చుట్టరికం ఉన్న యువతీయువకులూ, ప్రేయసీ ప్రియులూ రంగులు చల్లు కుంటారు. ముఖాన పూస్తారు, పూయించు కుంటారు, సరససల్లాపాలతో సరదాగా కాలం గడుపుతారు. మధ్యాహ్నం స్నానంచేసి రంగులు కడుక్కుని తియ్యని పదార్థాలతో భోజనం చేస్తారు. పాత కలహాలు మరచి నూతనరాగానుబంధంతో అందరూ కలిసి మెలిసి ఆనందంగా ఈ రెండురోజులూ

పండుగ చేసుకుంటారు. ఇది ఫాల్గుణ పూర్ణిమనాడు జరుగుతుంది. కృష్ణపాడ్యమి వస్తుంది కాబట్టి ఒకవిధంగా దీన్ని వసంతోత్సవమనే చెప్పవచ్చు.

ఈ వసంతోత్సవాన్ని మీరా చాలా ఉత్సాహంతో వర్ణిస్తుంది. ఇది మామూలు వసంతం కాదు. గిరిధారి తనయింటికి విచ్చేసిన విలక్షణమైన వసంతం. కృష్ణమూర్తి స్వయంగా పండుగలో పాల్గొంటున్నాడు. ఆయన పిల్లనగ్రోవి చేతపట్టుకొని మధురంగా పాడుతూఉంటే ఆయన స్నేహితులు డప్పులు వాయిస్తున్నారు. వ్రజవనితలు చుట్టూ చేరి తమాషా చూస్తున్నారు. మధ్యమధ్య మాధవుడు అందరి మీదా చందనం చల్లుతున్నాడు. కుంకుమపువ్వు చేతినిండా తీసుకుని కుంకుమ లాంటి ముఖాల మీద గోపాలుడు వెదజల్లుతున్నాడు. రకరకాల రంగులు గుప్పిటనిండా తీసుకుని గోవిందుడు అందరిమీదా చల్లుతున్నాడు.

నవనవలాడే నవల కిశోరునికి బహిఃప్రాణమైన రాధా దేవి అతని చెంతనే ఉంది. చెలికత్తెలందరూ రాగమాలికలో వసంతసంకీర్తనం చేస్తూ ఉంటే రాధామాధవులు తాళంవేస్తూ తలలూపుతూ ఉన్నారు. రసిక శిఖామణి శ్రీకృష్ణ పరమాత్మ పాల్గొన్న యీ ఫాల్గుణ మహోత్సవం వ్రేపల్లెను ఆనందవారిధిలో ముంచివేసింది.

మీరా మనస్సును ముచ్చిలించిన మోహనాంగుడు ఆనంద లోలుడై ఆనందాన్ని పంచిపెడుతున్నాడు.

## 4

మాయీ మ్హానే సుపనే మేఀ పరణ గయా గోపాల్
అంగ్ అంగ్ హల్దీ మైఀ కరీజీ, ఘదే భీజ్యో గాత్ |
మాయీ మ్హానే సుపనేమేఀ పరణ గయా గోపాల్ |

ఛప్పన్ కోట్ జహాఁ జాన్ పధారే, దుల్హా శ్రీభగవాన్ |
సుపనే మేఁ తోరణ్ బాంధియోజీ, సుపనేమేఁ అయిూ జాన్ |
మీరా కో గిరిధర్ మిల్యాజీ, పూర్వజనమ్ కే భాగ్ |
సుపనే మేఁ మ్హానే పరణ గయా జీ, హోగయా అచల సుహాగ్ ||

* * *

ఒకనాడు మీరాబాయికి విచిత్రమైన కల వచ్చింది. కలలో తనకు పెండ్లయిందట. పెండ్లికొడుకు గోపాలుడట. ఆ కల నిజంగా కల కాదట. అది నిజంగానే జరిగినట్లు ఆమెకు అనిపించిందట. ఆ కలను గురించి ఆమె తన తల్లితో ఇలా చెప్తుంది:

"అమ్మా, నాకు కలలో పెళ్ళయింది. నేను రోజూ ఆడుకొనే బొమ్మలోని గిరిధరగోపాలుడే నన్ను పెళ్ళిచేసుకున్నాడు. నిజంగా ఆ గోపాలుడేనే. అది నిజంగా కల గాదు. కలగా కనిపించిన నిజం. నీకు నమ్మకం లేకపోతే ఒకసారి నా ఒళ్ళు చూడు. ఒంటినిండా పసుపు పూసిన గుర్తులు ఎంత చక్కగా కనిపిస్తున్నాయో! అంతేకాదు, అమృతంతో నేను స్నానం చేశాను. ఒళ్ళంతా ఇంకా తడితడిగానే ఉంది. యాభైయారుకోట్ల జనులు మా పెళ్ళి చూచేందుకు వచ్చారు. అమ్మా, నాకు నిజంగా పెళ్ళయిందమ్మా! నిజంగా కలలో పెళ్ళయిందమ్మా! గోపాలుడు నన్ను పెళ్ళిచేసుకొన్నాడమ్మా! కల్యాణమండపానికి కట్టిన తోరణాలు నా కింకా కళ్ళకుకట్టినట్లు కనిపిస్తూ ఉన్నాయి. అసలది కలగా అనిపించటం లేదు. ప్రత్యక్షంగా పాణిగ్రహణం జరిగినట్లే నాకు తోచింది. ఆ కల గూడా ఎంత కళకళలాడుతూ ఉందో! నాకు నా గిరిధరుడు దొరికాడు. చిన్నప్పుడు నా బొమ్మను చూపించి ఇతనే నీ భర్త అని నీ వనేదానివి. నిజంగా అతనే నా ప్రాణేశ్వరు డయినాడు. ఎన్ని జన్మల తపస్సో ఫలించింది. పూర్వజన్మసుకృతంవల్ల నాకు పురుషోత్తముడు పతిగా లభించాడు. కలలో అయిన యీ కల్యాణం నాకు

కలకాలం సౌభాగ్యాన్ని ప్రసాదిస్తుంది. పగలు మేల్కొని ఉండగా అయిన పెళ్ళి యింత గొప్ప అదృష్టం తెచ్చిపెట్టలేదు. కనిపించే కల్యాణకార్యం కంటే, కనిపించకుండా కనిపించినట్లు అనిపించే యీ కల్యాణభావమే శాశ్వతమైనది. నేను నిత్య సుమంగళి నయినాను."

గోదాదేవి కూడా ఇలాగే తన కల్యాణాన్ని వర్ణించింది.

## 5

మైఁ నే రామ (నామ) రతన్ ధన్ పాయో,
బసత్ అమోలక్ దీ మేరే సత్‌గురు, కరి కిరపా అపణాయో,
జనమ్ జనమ్ కీ పూంజీ పాయీ, జగ్ మేఁ సభై ఖోవా యో ।
ఖరచై నహీఁ కోయీ చోర్ న లేవై, దిన్ దిన్ బఢత్ సవాయో ।
సత్ కీ నావ్ ఖేవటియా సత్‌గుర్, భవసాగర్ తరి ఆయౌ ।
మీరా కే ప్రభు గిరిధర నాగర్, హరఖి హరఖి జస్ గాయో ॥

* * *

సంసారసముద్రం దాటేందుకు సాధనచేసే సాధువులకూ, సన్న్యాసులకూ, కర్మయోగులకూ, జ్ఞానసంపన్నులకూ, భక్తాగ్రేసరులకూ అందరికీ నామం నావగా ఉపకరిస్తుంది. కలియుగంలో నామసంకీర్తన మొక్కటే తరణోపాయం అని పరమార్థపరాయణు లంటారు. అలాంటి నామం తనకు కూడా లభించిందని మీరాబాయి తన ఆనందాన్ని ఈ పాటలో వ్యక్తపరుస్తుంది.

రామనామ మనే అమూల్యరత్నం నాకు లభించింది. దీనికి విలువకట్టటం ఎవ్వరికీ సాధ్యంకాదు. మామూలు రత్నాలు డబ్బిచ్చి కొనుక్కోవచ్చు. కాని రామనామమనే రత్నం విలువకట్టి కొనుక్కొనే సులువైన పదార్థం కాదు. పురాకృతపుణ్యపరిపాకం వల్ల సద్గురుకటాక్షం

చేత లభించవలసిన దుర్లభరత్నరాజమిది. నా గురువుగారు నన్ను కనికరించి నా కీ రత్నం అనుగ్రహించారు. ఈ ద్రవ్యం ఒకనాటితో, ఒక యేటితో, ఒక జీవితంతో వ్యయపడిపోయేది కాదు. తరిగిపోయేది కాదు. జన్మజన్మాంతరాల వరకూ తరతరాలవరకూ ఇది చిరంతనంగా నిల బడుతుంది. వాడుకునే కొద్దీ మూలధనం పెరుగుతుందే కాని తరగదు. ప్రపంచంలో ఆస్తిపాస్తులూ, సిరిసంపదలూ అన్నీ నశించేవే, కాని ఇది మాత్రం అక్షయనిధి. సర్వస్వం వదులుకున్నా యీ రామ నామమనే రత్నం ఒక్కటి మిగిలితే చాలు. జీవితం తరిస్తుంది. అనేక జీవితాలను తరింపజేస్తుంది. దీనికి ఖర్చులేదు. దొంగలు తీసుకొని వెళ్తా రేమో అనే భయంలేదు. నానాటికీ వృద్ధిచెందుతుంది. సత్యపరాక్రము డైన రాముని భవ్యనామం సంసారసాగరాన్ని దాటేందుకు దివ్యమైన నావ. ఈ నావను నడిపించేందుకు సద్గురువు లభించారు. కాబట్టి సంసారసముద్రాన్ని ఇక అవలీలగా దాటవచ్చు. సత్యమనే నౌకను సద్గు రువు నడిపిస్తూ ఉంటే గిరిధారిని నమ్ముకున్న మీరాబాయి ఆనందంగా ప్రయాణం చేస్తూ ఉన్నది. గమ్యంచేరటం ఖాయం. ఈ మహానందంతో పొంగిపోతూ ఆమె పరమాత్మని కీర్తిస్తున్నది.

గిరిధరగోపాలుని అనన్యంగా ఆరాధించే మీరాబాయి యీ పాటలో ఉన్నట్లుండి రామనామమహిమను కొనియాడటం కొంచెం ఆశ్చర్యంగానే ఉంటుంది. అందుకని కొందరు మొదటి పంక్తిని 'రామరతన్ ధన్ పాయో' అనేందుకు బదులు 'నామ రతన్ ధన్ పాయో' అని పాడు కుంటారు. కాని రామనామం మీరా నోట పొరబాటున రాలేదు. త్రికరణ శుద్ధిగానే ఆమె రామనామాన్ని అమూల్యరత్నంగా పేర్కొ న్నది. లేకుంటే 'రామనామరస పీజైమనువా' అని మరోపాటలో ఆమె స్పష్టంగా రామనామాన్ని గురించి ముచ్చటించదు. నిజానికి రామ భక్తులకు కృష్ణుడు, కృష్ణభక్తులకు రాముడు సమానసమ్మాన్యులే. రామ భక్తుడు పోతన కృష్ణకథను కీర్తించాడు. కృష్ణభక్తుడయిన అసామీకవి

మాధవకందళి రమ్యమైన రామాయణం రచించారు. సూరదాసు రామ భక్తికి సంబంధించిన గీతాలెన్నో పాడారు. అలాగే మీరాబాయి రామనామాన్నే యీ పాటలో కీర్తించిందని భావించటం సమంజసం. ఇదే భావాన్ని మీరాబాయీ చాలా పాటల్లో వ్యక్తపరచింది.

## 6

రామనామ రస్ పీజై మనునాఁ, రామనామ రస్ పీజై ।
తజ్ కుసంగ్ సత్‌సంగ్ బైఠి నిత్, హరిచర్చా సుణి లీజై ।
కామ క్రోధ మద లోభ మోహకూఁ చిత్‌సే బహాయి దీజై ।
మీరా కే ప్రభు గిరిధర్ నాగర్, తాహి కే రంగ్‌మేఁ భీజై ॥

* * *

'పిబరే రామరసం' అని రామభక్తు లందరూ బోధించారు. కృష్ణ భక్తులు కూడా రామనామంలోని రమణీయతను గుర్తించి నామరసాన్ని ఆస్వాదించి తరించమనే భక్తకోటికి ఉపదేశించారు. నామ- రూప- లీలా-ధామ చతుష్టయంలో నామానికి రామనామం, లీలలకు కృష్ణలీలలు ప్రసిద్ధములు. రూపం, ధామం ఇద్దిరివీ ప్రశస్తములే. ఇదే పద్ధతిలో మీరాబాయి కూడా రామనామం జపించి కృష్ణలీలలను కీర్తించటం శ్రేయస్కరమని భావించిన సమన్వయభావయోగిని.

రామనామరసం సేవించినందువల్ల కలిగే లాభం మీరాబాయి యీ పాటలో వివరించింది. రామనామం సేవించమని మనస్సుకు ఆమె నచ్చ చెప్తూ ఉంది. రామనామం మీద ఆసక్తి ఏర్పడాలంటే దుర్జనస హవాసం వదలి సజ్జనసాంగత్యం చెయ్యాలి. సత్సంగంవల్ల మనస్సులో మంచి మంచి ఆలోచనలు ఉదయిస్తాయి. భగవద్విషయకమైన పవిత్ర భావనలు భక్తులనోట విన్నందువల్ల వివేకం కలుగుతుంది. 'సత్సంగత్వే నిస్సంగత్వం, నిస్సంగత్వే నిర్మోహత్వం, నిర్మోహత్వే నిశ్చలతత్త్వం,

నిశ్చలతత్త్వే జీవన్ముక్తిః" అన్నట్లు సజ్జనసహవాసంవల్ల జీవన్ముక్తి లభిస్తుంది. కాబట్టి మీరాబాయి మొదట సజ్జనసహవాసాన్ని అలవరచుకోమని చెప్తుతుంది. గోస్వామి తులసీదాసు కూడా 'బిను సత్ సంగ్ వివేక న హోయీ, రామకృపా బిను సులభ న సోయీ' అంటాడు. సజ్జనసాంగత్యంవల్లనే సదసద్వివేకం లభిస్తుందట. కాని ఆ సజ్జన సాంగత్యం కూడా రామానుగ్రహం లేకుండా లభ్యపడదట. కాబట్టి రామానుగ్రహం ఉంటేనే రామనామం మీద ఆసక్తి కుదురుతుంది. రామనామం వల్లనే రామానుగ్రహం లభిస్తుంది. పెళ్ళి కుదిరితేగాని పిచ్చి కుదరదు. పిచ్చి కుదిరితే గాని పెళ్ళి కాదన్నట్లు ఇది కూడా ఒక చిక్కుసమస్య. కాని ఈశ్వరానుగ్రహం ఎప్పుడు ఎలా లభిస్తుందో ఈశ్వరునికే ఎరుక.

కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యాలు మనస్సును బాధిస్తూ ఉన్నంతవరకూ భక్తి కుదరదు. మంచిపనుల మీద ఆసక్తి కలుగదు. కాబట్టి ముందుగా ఈ అంతశ్శత్రువులను మనస్సునుంచి పారద్రోలాలి. అప్పుడు మనస్సు నిర్మల మవుతుంది. నిర్మలమైన మనస్సు నీలమేఘశరీరు నియందు సులభంగా లగ్నమవుతుంది విషయ విసర్జన చేస్తేనేకాని వివేకం ఉదయించదు. రాముడున్నచోట కాముడుండడు. కాముడున్నచోట రాముడు ప్రవేశించడు. కాబట్టి రామనామరసాన్ని ఆస్వాదించాలంటే కామాది శత్రువులను పారద్రోలి రామానుగ్రహంకోసం ప్రయత్నించాలని మీరాప్రబోధం.

## 7

నైనా లోభీరే బహురి సకే నహిఁ అయి,
రోమ్ రోమ్ నఖసిఖ సబ్ నిరఖత్, లలకి రహే లలచాయి ।
మైఁఠాడీ గ్రిహ్ అప్‌నేరీ, మోహన్ నికసే ఆయి ।

బదన్ చంద్ పరకాసత్-హేలీ, మంద మంద ముస్కాయి |
లోక్ కుటుంబి గరజి బరజిహీం బతియా కహత్ బనాయి |
చంచల్ నిపట్ అటక్ నహింమానత్, పరహథ్ గయే బికాయి |
భలీ కహో కోయి బురీ కహో మైం సబ్ లయిసీస్ చఢాయి |
మీరా కహే ప్రభు గిరిధర్‌కే బిని, పల్ భరి రహ్యో న జాయి ||

* * *

"యద్గత్వా న నివర్తంతే తద్ధామ పరమం మమ" ఎక్కడికి వెళ్ళిన తర్వాత మళ్ళీ తిరిగిరావటమనేది ఉండదో అదే పరంధామం. అదే పుణ్యాత్ములు పరమపదించిన తర్వాత పొందే వైకుంఠనగరం. ఈ నగరద్వారంలో నిలబడి మీరాబాయి తన తన్మయమనోదశను వర్ణిస్తున్నది:

"నా కళ్ళకు ముగ్ధమనోహరమూర్తి కనిపించాడు. అంతే--ఆకళ్ళు మళ్ళీ తిరిగిరాలేదు. ఆయన రూపలావణ్య మహోజలధిలో అలాగే లీనమయిపోయినాయి. అణువణువులో, నఖశిఖ పర్యంతం ఆ రూపమే వ్యాపించింది. ఎంత చూచినా తనివి తీరటంలేదు. ఎంతసేపు చూచినా ఇంకా చూడాలనిపిస్తున్నది. నేను మాయింటి ముంగిట నిలబడి ఉన్నాను. నా ఎదుటి నుంచే నందనందనుడు నడిచివెళ్ళాడు. ముసిముసినవ్వులతో ముద్దులుగారు మోముతో వెన్నెలలు వెలయిస్తూ వెన్నదొంగ వెళ్ళిపోయాడు. ఆ రూపం చూచిన నా చూపులకు మరో రూపం మీద మమకారం పోయింది. బంధువులూ, కుటుంబంలో దగ్గిరివాళ్ళూ నా మనస్థితిని అర్థంచేసుకోలేక ఏమేమో అనుకొన్నారు, అంటున్నారు. నా మనస్సు నా స్వాధీనంలో లేదు. క్షణం కూడా శ్యామసుందరుని రూపలావణ్యం నుండి అది మరలిరావటంలేదు. ఎవరేమనుకొంటే నాకేం నష్టం! అందరి మాటనూ శిరసా వహిస్తాను.

నా బాటను నే ననుసరిస్తాను. గిరిధారిని చూడకుండామాత్రం క్షణం కూడా ఉండలేను."

అయోధ్యను వదలి అరణ్యాలకు వెళ్ళుతున్న రామచంద్రుణ్ణి చూచి దశరథుడు కూడా "నా చూపులు రామభద్రునితోనే వెళ్ళిపోయాయి. నాకేమీ కనిపించటంలే" దని కౌసల్యతో అంటాడు. ఈ అర్థం ఇచ్చే ఈ శ్లోకం వాల్మీకి మహర్షి యిలా గానం చేశాడు:-

రామం మేఽనుగతా దృష్టిః అద్యాపి న నివర్తతే,
న త్వా పశ్యామి కౌసల్యే సాధు మాం పాణినా స్పృశ.

నయనానురాగం అలాంటిది. అందులో మీరా నయనాలు నంద నందనునికి ఆనందనిలయాలు గదామరి !

# 8

భజ్ మన్ చరణ కమల అబినాసీ,
జేతాయి దీసే ధరణ్ గగన్ బిచ్, తేతాయి సబ్ ఉఠి జాసీ |
కహా భయో తీరథ్ వ్రత్ కీన్హే, కహాలియే కరవత్ కాసీ |
ఇహ దేహీకా గరబ్ న కరణా, మాటీమేఁ మిల్ జాసీ |
యో సంసార్ చహర్‌కీ బాజీ, సాంఝ్ పడ్యా ఉఠ్ జాసీ |
కహా భయో హై భగవా పహర్యాఁ ఘర్ తజ్‌భయే సన్యాసీ |
జోగీ హోయ్ జగతి నహిఁ జాణీ, ఉలటి జనమ్ ఫిర్ ఆసీ |
అరజ్ కరో అబలాకర్ జోరే, స్యామ్, తుమ్హారీ దాసీ |
మీరాకే ప్రభు గిరిధర నాగర్, కాటో జమ్‌కీ ఫాసీ ||

* * *

ఎంత కూర్చినా, ఎంత నేర్చినా ఎంతవారికయినా శ్రీకాంతుని చరణములే శరణములని మీరాబాయి తీర్పు. భువికీ దివికీ మధ్య

కనిపించే పదార్థాలు సమస్తం నశించిపోతాయి. చివరకు మిగిలేది శ్రీకాంతుని చరణకాంతి ఒక్కటే. కాబట్టి అవినశ్వరాలయిన ఆ దివ్య చరణారవిందాలను మనసారా భజించుమని మీరాబాయి తనమనస్సుకు బోధిస్తున్నది.

ఎన్ని తీర్థయాత్రలు చేసినా, ఎంత కఠోరమైన వ్రతచర్య సలిపినా, కాశీ వెళ్ళి పడరాని పాట్లు పడి శరీరాన్ని కృశింపజేసి ఘోరతపస్సు చేసినా యీ శరీరం ఒకానొకరోజు నశించిపోవలసినదే. ప్రపంచంలో ప్రతిజీవీ మరణించవలసిందే. మట్టికుండలాంటి యీ శరీరం చివరకు మట్టిలోనే కలిసిపోతుంది. పగటివేషాలవంటి యీ బ్రతుకు ప్రొద్దు కుంకగానే మాయమైపోతుంది. కాషాయవస్త్రాలు ధరించినంత మాత్రాన సన్న్యాసి కాడు. ఇల్లువదలిపెట్టిన ప్రతివ్యక్తీ బైరాగి కాడు. యోగంలోని రహస్యం తెలియనివాడు యోగి కాడు. భగవదనుగ్రహం లేకుంటే జననమరణసంసరణం తప్పదు. కాబట్టి మీరా శ్రీచరణదాస్యం చేసి తరించాలని సంకల్పించింది. తాను కేవలం అబల. కాని తనకు గోపాలుడే బలం. భవబంధ విముక్తిని ప్రసాదించి తనలో తనను లీనం చేసుకొనే గిరిధరగోపాలుడే మీరాకు శరణ్యం.

'అన్యథా శరణం నాస్తి త్వమేవ శరణం మమ' అని త్రికరణశుద్ధిగా మీరాబాయి శ్రీహరి చరణాలను ఆశ్రయించి తరించింది. ఆమె చూపిన బంగారుబాటనే మనమందరం అనుసరిద్దాం.

గోవిందం గోకులానందం గోపాలం గిరిధారిణమ్,
గోలోకవాసినం వందే గోదా మీరాధినాయకమ్.

* * *